మత్తకోకిల. అంతఁ గంతునిపంత మెంతయు ♦ నంతకంత కనంతవి
క్రాంతిఁ బర్వఁగ నోర్వ కె ట్టటు ♦ కాని యింద్రునియల్క పై
రింతు నంచును సాహసం బొన ♦ రించి యే నిటు వచ్చితిం
గొంత వెండియు నింద్రు నెంచుచుఁ ♦ గొంచితిన్ నిను డగ్గఱన్. 258

చ. తపసితపఃక్రియల్ చెఱిచి ♦ దైవతకార్యము నిగ్రహించి నీ
వెపుడెపు డేగుదెంతు నిను ♦ నెప్పుడు కౌఁగిటఁ జేర్తు నంచు నే
నపరిమితాశ నోజలరు ♦ హానన యివ్వనిచేరువం బ్రయా
సపడుచు నిల్చుకొంటిఁ బిక ♦ సంచయపంచమవంచితాసువుల్. 259

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడొ, యిక్కరణిన్ మోసపుచ్చి ♦ యేలుకొనంగా
నక్కట వలవనిశంకల, నక్కడనే పొడుకాఁపు ♦ లాగతి నుంటిన్. 260

ఉ. ఇంతకుమున్ను నారదము ♦ నీశ్వరుఁ డచ్చటి కేగుదెంచి నీ
వెంతయు మన్మథార్తిఁ బడి ♦ యేమిటి కిచ్చట నున్నవాఁడ వో
భ్రాంతుఁడ నీదురూపమున ♦ రంభ నొకం డవలం గరంబు వి
భ్రాంతిని ముంపుచున్ వివిధ ♦ భంగుల నేలుచు నున్నవాఁ డనన్. 261

క. విని వచ్చితి నేసమయం, బున నేగతి సందుకొనియెఁ ♦ బొలఁతుక యితఁ డీ
తని తెఱఁగుఁ జెప్పుమున నే, మని చెప్పెద ననుచుఁ జూచె ♦ నది ప్రియుమొగమున్.

తే. చూచుటయు నేమిచూచెదు ♦ శోభనాంగి, నిన్నుఁ జెందినపాట్లెల్ల ♦ నన్నుఁ జెంద
కుండునే నాఁటియులనార ♦ దోక్తి యరయ, నాఁడు నీతోడ నమ్ముని ♦ నాయకుండు.

క. నినుఁ బోలువనిత నీకును, వనజముఖీ యితనిఁ బోలు ♦ వాఁ డితనికి నెం
దును గలిగి కలంచునె యి, ట్టినిగాఢపుసొంపుమదము ♦ ఠీవులు చనునే. 264

క. అని పలికెఁ గాదె యది వృథ, చనునే నైనను లతాంగి ♦ శంకింపకు నీ
మనమున నీగతి నిప్పుడు, తునిమెద నాఖడ్గమునను ♦ దుర్దమలీలన్. 265

వ. ఆఖడ్గం బప్పుడల్లయచటికేళీనికుంజంబునం బెట్టినవాఁడ నిదె తెచ్చుకొనియెద నని పోవం జూచినఁ దత్ప్రతిభటుండు నీ కింతబీరంబు గలిగినం బోరు ఘోరంబు చేసి యిటు నటుం జన నేల నిరాయుధు నంటేని నేను నాయుధం బిదె విడిచితి నని విడిచి యుద్ధంబుగా నడిచిన బెడిదంపుటీరసంబున వీరరసంబును ఘోరంబులగుచు నుల్లసిల్ల మల్లయుద్ధం బాయిద్దఱకుం దద్దయుం బ్రవర్తిల్లె నప్పుడొండొరులయుద్దండదోర్దండచండాస్ఫాలనాభీలఘోషవిజృంభణంబులు కుంభినీధరగహ్వరసముద్ధతప్రతిధ్వానంబులచేత నినుమడించి ప్రళయజలధరవర్గనిర్గళితంబులగుబలుపిడుగులమ్రోఁత ననుకరింప నిశ్శంకనిరంకుశాహాంకారహుంకారగంభీరారావంబులయార్భటులు నిర్భరసముద్భటంబులై దిగ్భిత్తులఁ బిక్కటిల్లుచు వ్రిక్కలింప నొక్కొక్కరిమిక్కుటపువిక్రమంబులపెక్కువ లెక్కగొననియక్కజపుఁ జేతుక్కున మిక్కిలి పేర్చునిచ్చలపుటగ్గలికలఁ దగ్గుమొగ్గు లేక డగ్గఱి

యాగ్రహంబు నెఱప నెడ్డారింపుచు గడ్డురకనీక యడ్డంబుగా నొడ్డుకొని యొం
నెదిరిపిడికిలి పాయం దట్టి బెట్టిదంపుటురువడిం దొడింబడఁగఁ దీసి కీలాగిర్త్రం
ష్ఠురముష్టిఘాతప్రయోగనైపుణంబుల దీపించుచుఁ గోపంబుశ నేవు చూపె
నాటోపంబుల నాఁపరానియనూనంపుబిఱుసునం బరుసఁదనంబునఁ హెచ్చ
జెచ్చెరఁ జొచ్చి పట్టికొని హెచ్చరికం గచ్చువదలఁ బెరిఁగెడియచ్చలంబులు
లంబును బ్రబలంబుఁ జేయుగళంబుల ముంజేతు లిడి పెడమర నొక్కి నెత్తి
విఱిచి పడవైచియుఁ బడనైచిన విడువక తోడన పరునిం బడం దిగుచుచుఁ
చిన బిగివదలక పయిం బడి కదలమెదలనీక పొదివి పట్టుచుఁ బట్టిన నిట్టట్టు
నంగి పట్టు వదలించి కరంబులు నురంబుల నడిమికి ముడించి యొడిసికొని బ
బడిం బొడుచుచుం బొడిచినఁ బొడవనీక కడింది కడిమి నడంగం బట్టి పగతు
లు తొడలనిఱికి పరాక్రమించుచుఁ బరాక్రమించినను విక్రమంబు దక్కక
కటిదట్టికట్టు పిడికిటఁ దొడివి యెత్తి తెరపిగొని పఱపి మోఁకాళ్లు నడుమ
బున నానివెల్లకిలఁ ద్రెళ్ల బిళ్లమీఁటుగాఁ జిమ్ముచుఁ జిమ్మి ముమ్మరపువేగంబున
డన లేచి పైఁబడఁ గడంగిన నెడయీక పదంబులు చాచి యెదు రొడ్డుచు
ముఱి నెక్కింత తఱిఁ గని యద్భుతరయంబున దిగ్గున లేచి మెడ యొడిసి
గ్రుడ్లు వెలికుఱక నొక్కుచు నొక్కినఁ జిక్కువడక యొక కేలఁ గోకపట్టు నొక్క
కేలఁ దొడయుఁ బట్టి కూలవైచి మఱియు మల్లచఱచి క్రమ్మఱ లెమ్మని
గర్జిల్లుచు గర్జిల్లిన నూర్జితరయంబున మగుడఁ దలపడి పౌరుషంబు సేయు
వెండియుం బాయుచు డాయుచు ననేకప్రకారంబులఁ బోరుచుండ. 266

ఆ. అట్టియెడను బచ్చ♦పట్టుదట్టీచేత, నొప్పుతనదుప్రియుని ♦ నుజ్జ్వలాస్య
లీవి నెఱపుచంద్ర♦కావిదట్టీచేతఁ, బరుని గుఱు తెఱింగి ♦ సురవధూటి. 267

క. ఇక్కరణి నించుకంతయు, నెక్కువతక్కువలు లేక ♦ యిరువురు సరిగా
నుక్కునఁ బోరాడి శ్రమం, బెక్కుడుగాఁ జేసి నిలిచి ♦ రెడగా సంతన్. 268

ఉ. రంభయు వారిరూపు ననిఁ ♦ బ్రౌఢియుఁ దుల్యతఁ బోల్చి సంశయా
రంభ మెనర్ప నెవ్వరిఁ ది♦రంబుగ నమ్మక హా యిలుంపు నం
రంభము మాని యే నడుగు♦ప్రాక్తనవర్తన మొక్కటిన్ రహా
స్సంభవ మైనదాని వరు♦సన్ వచియింపుఁడు మీర లిత్తఱిన్. 269

క. దానన్ సత్యాసత్యత, నే నామతికోలఁది నిశ్చ♦యించుకొనఁగ నె
వ్వానికి నెయ్యది యుచితం, బానియతి యతండు పొంప్పు ♦ టర్హం బనినన్.

వ. అని యావనిత యాడుమాటకు వార లియ్యకొని నిద్దఱుం బాయ
బిలిచి యొకఁడు వినకుండ నొకనితోడ మనకుఁ దొల్లి కళాపూర్ణుం
ప్రసంగం బెచ్చటఁ గలిగెఁ దత్ప్రకారం బేమి నీవు వింటి వని యడుగుటయు
ద్వితీయుండు దానికి సమ్మతంబుగా నుత్తరం బిచ్చెఁ బ్రథముండు వెలవెల

ఉచు నూరకుండె నయ్యతివయు నతనిం జూచి కటకటా యిందాఁక నేను నిన్ను నిక్కపుఁబ్రియుం డనుచు నమ్మి యుండితి నీవు కపటరూపధరుండవే య ని యద్భుతంబును జుగుప్సయు భీతియు నాకారంబును దీపింప నతని విడిచి యి తరునిం బరిగ్రహించె నతం డమ్మాయ విలోకించి యతని నల్పావశిష్టాయువుగా శపియించె నప్పుడు రంభ యక్కపటవర్తనుం జూచి నీ వెవ్వండ వెవ్విధంబున నిట్టిరూపంబు ధరియించి నన్ను వంచించి తని యడుగుటయు నత్యనలకూబ రుండు. 271

సీ. ఇందాఁక నినుఁ జేర•నీక నన్నిట్లల, యించుట చాలక • యింక నిలిపి
వాని నే మడిగె దె•వ్వాఁడు గాక నీ కేమి, యిది కాకదంతప•రీక్ష నుమ్ము
నామన్మథార్తి యె•న్నఁగ వలదే చాలు, రా ర మ్మటంచు నా•రంభ నపుడ
తోడ్కొని చనియెను• వేడ్కతో మోముఁదా, మర వికసింపఁగా•సురపథమున

తే. నంత నితరుండు చింతతో • నంత నింతఁ
గొంతవడి నిల్చి దీనతఁ • గొమరు దఱుఁగఁ
జనియె మణికంధరునిపర్ణ•శాలదిశకు
నల్లనల్లన మిక్కి లి • నలసగతిని. 272

వ. అట్టియెడ ము న్నతండు తన కేళికానికుంజంబునం బెట్టిననాపట్టెంబుఁ బుచ్చుకొ ని తత్సంతోషంబున నుబ్బుచు నిచటికి వచ్చితి నిది యిచ్చినప్పుడు మద్గురుండు నాతోడ దీని నెవ్వరి గ్రేవేయం బూనితి వవశ్యంబును వారిని వధియింపక మాన దని యానతిచ్చినవాఁ డేను నిమ్మహాయుధంబు కలభాషిణికంఠంబు గ్రేవేయ నట్లు ఘూన్చితిం గావున నప్పటికిఁ దప్పిచనియు మీఁదట నవశ్యం బగు నని పలుకుచు నంతం గలభాషిణిం జూచి కడమపలుకక గ్రక్కుటయు నాకలభాషిణి యతని నీక్షించి సంకోచం బేల భవితవ్యతావశంబునఁ గా నున్నయర్థంబు గాక మాన దనుటయు నమ్మాటకు మెచ్చుచు నతండు. 273

క. నీవు వివేకధురీణవు, గావున నిమ్మాట యంటి • గాక యవశ్యం
భావి యగుదుఃఖమును జను, నే వ్రాకువ్వంగ నిజము • నిష్ఠుర మెందున్. 274

తే. ఇంక నీవృత్త మెఱిఁగింపు • మేను బలిమిఁ
బట్ట మొఱఁ బెట్టునిను డించి • పాఱిపోయి
క్రమ్మఱఁగ వచ్చి మఱి నిన్నుఁ • గాన నెచట
నుండి తది మొదలొ్కని చెప్పు • మువిద యనిన. 275

శా. మేఘాంభోనిధికామధేనుసురభూ•మీజాతచింతామణి
శ్లాఘాలంఘనజాంఘికత్వసముదం•చద్దానలీలాసఘం
టాఘోషానిశఘోష్యమాణపరిపూ•ర్ణశ్రీకటాక్షోదయ
ద్రాఘీయోధనసంపదూర్జితయనం•తప్రాభవస్ఫూర్జితా. 276

క. కంజముఖీలోచన జీ, వంజీవాజీవమృదున•వస్మితశోభా
మంజులముఖచంద్ర సదా,రంజితవిద్వత్కవీంద్ర • ప్రణుతోపేంద్రా. 277

స్వాగతము. నిర్వరామధర•ణీభరణాంకా, గర్వితారిజయ•కర్తవిశంకా
సర్వదిక్చరవి•శంకటకీర్తి, శర్వరీరమణ•సన్నిభమూర్తి. 278

గద్యము ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్యతనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# కళాపూర్ణోదయము.

## చతుర్థాశ్వాసము.

సౌభాగ్యవిభూతిపి
లాసాలంకార నిత్య♦లలితాకారా
భాసురయశఃప్రసూనసు
వాసితసకలాశ కృష్ణ♦వసుధాధీశా. 1

సీ. ఆవధూమణి నవ్వి ♦ నావర్తనము నీవ, చెప్పితి వింక నేఁ ♦ జెప్పవలెనె
గురుసత్త్వఁ డగునల♦కూబరుచేఁ బట్టు, వడి నీవు ననుఁ జూపఁ ♦ గడఁగి యట్లు
వచ్చుచో నెదురుగా ♦ వచ్చినరంభ నేఁ, జుమ్ము నిక్ విడిపించి ♦ యిమ్మెయిఁ జని
యభిమతం బైనయ ♦ ట్లంగజలీలావి, హారంబు సలిపితి ♦ నంతలోన
తే. నరుగుదెంచినయదియ సు♦మ్మాద్యరంభ, యారమణిఁ బ్రాణవిభుదండఁ ♦ జేరనీక
యవ్విధంబునఁ బోరాడి ♦ యంతమునను, దద్గతిని శాపమొందిన♦దాన నేను. 2

చ. అన విని వార లందఱును ♦ నత్యధికం బగువిస్మయంబునన్
మునుఁగుచు నెట్టటూ చెపుమ ♦ ముద్దియ యేగతి నట్లు రంభరూ
పును ధరియింప నేర్చితివి ♦ పొందుగ నెమ్మెయి సందుకొంటి వా
యనఘుని నట్లు గూడఁగఁ జి♦రాభిమతం బిది నీకు నావుడున్. 3

సీ. ఆకాంత సిద్ధు నా♦లోకించి నిన్న న, వ్విధమునఁ దరమెడు♦వేళఁ దనదు
ప్రాణేశు వెంటన ♦ యారంభ గదలి తా, నేతెంచినంతట ♦ నిట్టి యొకటి
యెదురుగా వచ్చుట ♦ కెంతయు శంకించి, యటముందు పోవక ♦ యచట నిల్చి
నప్పుడే నీక్షించి ♦ యదియ వచ్చినయట్లు,గాఁ దదాకృతి గట్టి♦గాఁగఁ దాల్చి
తే. వచ్చితి నతండు నినుఁ బట్టి ♦ తెచ్చుచోటి
కాచెలువ రాక మసలుట ♦ యతని కెఱుక

పడక యునికి నాకృతివేష భాషణాదు
లాగతిన యున్కి నాచేత లమరె నట్లు. 4

తే. ఆచెలువరూప మొక్కట్ల యగుచు నుండఁ
దాల్చునేరుపు ము న్నొకఁ తఱిని నాకు
నారదుం డిచ్చె నదియు వినంగఁబడియెఁ
గద యతఁడ చెప్ప నీకు మా కలహవేళ. 5

క. అమ్మెయిఁ జెప్పియు నతఁ డవు, డమ్మాయారంభ యిది యంటంచు నను ప్రా
శమ్ముగఁ జేయక కారు, ణ్యమ్మున మన్నించె మన్మథాకృతిఁ గనుచున్. 6

వ. అది యెల్లఁ జెప్పనేమి కడపట నిట్టిశాపంబునకుఁ గారణం బైనయామాయారూప
యది యంతయు నుజ్జగించి యవశ్యభోగ్యం బైనతచ్ఛాపఫలం బిద్దేవినస్సి
ననుభవించినఁ బరోపకారం బగు నని వచ్చితి నని చెప్పి కలభాషిణి యస్సా
స్తంభున కిట్లనియె. 7

తే. నీదుగురుఁ డన్నయట్ల నిశితఖడ్గ, మవితథోద్యమ మగుట సువ్యక్త మయ్యె
దిరుగ నిన్నును నన్నును దెచ్చె దైవ,మిచ్చటికి ధన్య నైతి నీయుష్టమున.

చ. అది యటు లుండె నాపదుప్రయాసము లూరక పోక యుండ న
ట్లొదవెఁ బ్రియుల్ భజింప నని యుండఁగఁ జెప్పితి వీవు దానికిన్
గొద గలుగంగ సత్యనలకూబరుఁ డొక్కఁడు వేఱ వచ్చి తా
తుద నతనిన్ శపించె నని తొల్లిటియాకపటాత్ముఁ డెవ్వఁడో. 9

క. అన విని యేమియు మిక్కిలి, యనఁబోయెదు సుమ్ము తరుణియ ట్లప్రస్తా
బున నున్నవాఁడ నేఁ జు, మ్మని మణికంధరుఁడు పల్కె నల్లన నగుచున్. 10

వ. ఇట్లు పలికినం గలభాషిణి యాశ్చర్యంబు నొందుచు. 11

క. విని నీ వపు డెట్లారూ, పును దాల్చితి చెప్పు మని తపోహాతి గావిం
చిననేర్పునం దరంభయు, ధనదసుతుఁడు గూడె ననిరి తత్సఖు లెవు. 12

సీ. అని రంభ నట్లు గూడినవాఁడ నేనె యే, ర్పడ విను మట్లు తపంబు చెఱిచి
మును నన్ను నది గూడి తనరెఱుతనమూన, సము నలకూబరాసక్త మగుట
ప్రకటంబు గాఁగ గోత్రస్ఖలితత్వంబు, చే నెఱింగించిన నేను గోసి
దానివీక్షించి యెందేనిఁ బోయెద నని, వీడ్కొని చనుచు నవ్వలఁ దిరతులఁ

తే. దనియమిఁ దదాత్మరంజన దనరఁ గలయ
వలయు నని యంత మత్తపోవ్యయముచేఁ ద
దీయవిభురూపుఁ దాల్చి వే తిరిగి వచ్చి
పొసఁగఁ బల్కి రమించితిఁ బూర్ణరతుల. 13

వ. అత్తెఱంగున నద్దివ్యాంగనతో రమించుచునికిం జేసి తత్ప్రకారంబున నొసఁగిన
నీతోడిక్రీడ లనుభవించి యమ్మాయారూపంబునకు సద్యఃఫలంబుగా నట్టిశాపం

బుఁ బెచ్చుకొని యంతట బుద్ధిమంతుండ నై యప్పటిపర్ణశాలకుం జని యెల్లమా
యలం జాలించి నాపీనెయు రత్నమాలికయుఁ బుచ్చుకొని యచ్చటిమహిమ
లుం దొల్లి యెఱింగిననాఁడ నై యిం దేమివిశేషంబులు దొరకునో యని వచ్చి
తి నని చెప్పి నగుచు ని ట్లనియె. 14

చ. నెలఁతుక రంభఁ బొందు విడ ◆ నేరక యెంతఘనప్రయత్నతన్
నెలకొని యే రమింప నది ◆ నీ వయితే మని చెప్ప నీవు న
త్యలఘుతరప్రయత్నపర◆తన్ నలకూబరుఁ గోరి కూడి రం
జిలఁగ ననంగ యే నయితిఁ ◆ జిక్కితి వెట్లును నాదుకోర్కికిన్. 15

చ. జలజదళాక్షి యేను ముని◆శాపభయంబున నొందు నేరకిం
పెలివిపడంగనీక మది ◆ ధీరతఁ ద్రిప్పుదుఁ గాని నీపయిన్
గలదు సుమీ తలంపు మన◆గానకళాభ్యసనంబువేళలన్
ఫల మిఁకఁ బొందె దానికిని ◆ భాగ్యవిశేషవశంబునం దుదన్. 16

చ. అనుపమఁ గృతార్థ నైతిఁ గుటి◆లాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వం
చనముసఁ గూడునో యనువి◆చారము వాసెను నీదుపొందు నా
కు నభిమతంబె నీకుఁ దగ◆ నన్న తలంపున నీతలంపు నేఁ
గనుమిని ద్రిప్పుదున్ హృదయ◆కాంక్ష నినుం గనుఁగొన్నవేళలన్. 17

శా. సౌందర్యవిలాసభాసురతనూ◆నిర్నిద్రసౌభాగ్యమున్
సంగీతాదివిశేషకౌశలము నీ◆నిర్దోషనానాగుణో
ల్లాసంబున్ నను నప్పు డెంతపరమా◆హ్లాదంబు నొందించునో
యూసుద్దల్ హృదయైకసాక్షికము లే◆ మన్నన్ వృథా యిత్తఱిన్. 18

ఉ. ఆవిధ మూహసంతతిని నో◆కస్వామి నిన్నును జూచుచో మణి
గ్రీవునిపేరు దోఁచె మది◆కిన్ మణికంధర యేకదేశసా
మ్యానగుణాంబుచే నతని ◆ నాతనియన్నను మద్దిచెట్లుగా
నై నతమూని దిట్టినవి◆ధంబు మనంబునఁ బాఱె నంతటన్. 19

ఉ. దానను గుండె ఘుబ్బుమన ◆ దా నెరియన్ విడిచెం ద్వదంగసం
గానుభవేచ్ఛ యిట్లిడిన◆యట్టిది యేదిగ నాదుచిత్తమో
మానితశీల యంతట స◆మంచితతానకరూపరేఖచోఁ
గృ నుతికొంతి గల్గఁ గని ◆ యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్. 20

క. శాపభయంబున నెఱయఁగ, నీపైకోరికె మరల్చి ◆ నిధిపతిసుతు నే
నాపువేళను జూచితి, నో పడుచు నాబ గేను మఱి క◆నుంగొన గుఱిగాన్. 21

క. ఆయాపతనయుఁ డని ని, న్నే యేఁ బొందితిఁ దుదన్ వ◆నిన్ మనభాగ్య
శ్రీ యెమని చెప్పుదుఁ బడఁ, బోయినఁ బూఁబాన్పునఁ బడు◆పోలిక యయ్యెన్.

ఉ. శ్రీయుత మైనదివ్యమణి • చేతికి నబ్బఁగఁ బారవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని • చాలఁ గృశించితి గాజుపూసకై
నాయవివేక మే మనుకొ•నం గదఁ దన్మణి యబ్బె నన్న న
త్యాయతతత్సమాగమసు•ఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్. 23

ఆ. ఇట్టిమాట లిప్పు • డే నాడుకొనుటయు, ననుచితంబు వార•వనితపలుకు
లిచ్ఛకంబు లనక • యెవ్వరు నమ్మెద, రదియుఁ గాక దృష్ట • మన్యవాంఛ. 24

వ. అని లజ్జాశోకంబు లడర నవనతముఖి యైనకలభాషిణిం జూచి మణికంధరుం డిట్ల
నియె నోయుత్తమవిలాసిని నిన్ను నితరవారవనితలయ ట్లసత్యవాదినిగాఁ దల
ప నంత వింతవాఁడనే నీపలికినట్ల నీకు మున్ను నాయందుఁ గోరిక గలుగుటకుఁ గా
గుఱు తొకటి యున్నది యది యెద్ది యంటేని నారదుండు కడపట నిన్ను నింటి
కి ననుపుచు నేను విన నీతోఁడ. 25

తే. కొమ్మ నీవాత్మలో మును • గోరినట్టి, కాంతు రంభామనోహరా•కారుఁ డగుచు
మెఱయువానిని గూడి ర•మించఁగలవు, నమ్ము పొమ్మిఁక నీభవ•నమున కనిరా.

క. నలకూబరుఁ గూడెద వని, పలుకక యి ట్లనినసత్య•భాషణుపలుకుల్
ఫలసిద్ధిని నరయఁగఁ దొ, య్యలి నను మును నీవు గోరు • టనృతం బగునే. 27

క. ఆకోరిక శాపభయో, ద్రేకవిశేషమున నెఱయఁ • దెగు టరుదును గా
దోకామిని లోకమున వి, వేకింపఁగ గలవ యట్టి•వియు నొక్కొకచోన్. 28

వ. రంభాసాన్నిధ్యశోభితాభినవవిలాసభాసురుం డై ననలకూబరునిరూపున హా
ట్టిచిత్తంబునకుఁ దదన్యం బెట్టిది యైనను మఱి యింపుగామియుఁ జిత్రంబు గా
పురుషులందు నొక్కొక్కవేళ గుణంబున నిట్టివి గలవు తత్ప్రకాశకం బై
యొక్కకథ గల దది పాపనాశం బై యొప్పుచుండుఁ గావునఁ దాత్పర్యంబున నా
కర్ణింపుము తన్మూలంబు మొదలుకొని చెప్పెద నని యి ట్లనియె. 29

సీ. కాంత యేఁ దొల్లి య•నంతదేవవ్రతో, ద్యాపనకొఱకు న•నంతపద్మ
నాభునిసన్నిధా•నమునకు వచ్చితి, వచ్చి యచ్చటఁ గరం • బచ్చుపడఁగఁ
గవితచే నద్దేవు • వివిధభంగుల నుతి, సేయుసత్కవుల నీ•క్షించి యిట్టి
సౌభాగ్య మేగతి • సంభవించును యను, వాంఛతో నచ్చటి•వారివలన

తే. నీమృగేంద్రవాహనసుద్దు • లెల్ల వినుచు, నచటి కిద్దేవి యనతిదూ•రాంత
యగుటయు నెఱింగి యే తెంచి•తగ శిలాక్షు, రోక్తసాహసవిధినిష్ఠ•మొందితిఁగ.

వ. అరిగి యద్దేవునియగ్రమంటపమున. 31

ఉ. అంతము గాఁగ గౌతమక•ణాదమతంబులు భేదవాదిసి
ద్ధాంతము జైమినీయ మురగాధిపశాస్త్రముఁ గాపిలంబు న
త్యంతము నాకలించి యవి • యాత్మల మెచ్చనిపాంచరాత్రరా
ద్ధాంతవిధాసమర్థనస•మర్థకృతార్థమతిప్రదీప్తులన్. 32

సీ. శ్రీమహితాష్టాక్షరీమంత్రజపపరా, యణుల నారాయణ♦ధ్యానపరుల
దేవతాంతరచింత♦నావిదూరులఁ గామ, రోషాదిరహితుల ♦ రూఢమతులఁ
జడచిదీశ్వరతత్త్వ♦విదులఁ ద్రైలోక్యపా, వనచరిత్రుల బుధ♦వంద్యపదుల
సకలంకశీలుర ♦ నఖిలశ్రుతిస్మృతి, శాస్త్రపురాణవి♦జ్ఞానఘనులఁ
తే. దమకుఁ జక్రికి నిత్యసి♦ద్ధంబులైన, శేషశేషిత్వములు చింత ♦ చేసికొనుచు
నతనిదాస్యంబుగతి గాఁగ♦నరయుపరమ, వైష్ణవులఁ గంటి సభయైప్ర♦వర్తిలంగ.
క. కని యే దండనమస్కృతు, లనేకము లొనర్చి వార ♦ లడుగఁగ నాపే
రును గంధర్వత్వంబును, వినిపించి హరిస్తవేచ్ఛ♦విధముఁ దెలిపితిన్. 34
ఆ. తెలిపి యోసుబోధ♦విలసితులార మీ, రాయనంతశయను♦నట్ల నాకు
నాకవిత్వసేవఁ ♦ గైకొనుఁ డని తగు, వర్ణనకుఁ గడంగ ♦ వారు చూచి. 35
సీ. ప్రకృతిపూరుషులందు♦బహిరంతములను నె, ప్పుడుఁ జలింపక పరి♦పూర్ణుఁ డగుచు
దనకు నాదియును మ♦ధ్యంబునంతముసమా, నుఁడునధికుండు నెం♦దునుగలుగక
సర్వజ్ఞుఁ డై సర్వ♦శక్తి యై సర్వని, యంత యై సర్వాత్ముఁ ♦ డై వెలయుచు
సర్వంబుఁ దనకు శే♦షముగ సర్వమునకు, శేషి దా నగుచు ల♦క్ష్మియును దాను
తే. రుచియు రవియుఁ జంద్రికయుఁ జం♦ద్రుండువోలె
నయుతసిద్ధత్వ మొప్పంగ ♦ నాదిమిథున
మనఁగ సకలవేదాంతవే♦ద్యతఁ దనర్చు
పరమపదనాథుఁ బొగడు నీ♦ప్రౌఢికొలఁది. 36
క. అని యట్టిటు నాచేఁ ద, ద్వినుతులు సేయించి మెచ్చి ♦ విశ్వహితార్థం
బును జెప్పించిరి త్రిజగ, జ్జననీపరమపదనాథ♦సంవాదకథల్. 37
క. చెప్పించి యీకవితచే, నిప్పుడు గాకున్న నీకు ♦ నిఁక నొకమేనన్
దప్పక యొదవు తిరంబుగ, నప్పరమునిపరమభక్తి ♦ యని రధికదయన్. 38
వ. ఏనును దాదృశం బైనమదీయకవిత్వధార శారదాపీఠంబునందలియందఱివినుతి
కెక్కునందాఁక మిక్కిలి మెచ్చుకొనరా దని యచ్చోటికి నంత నరిగితి నని పలికి
యింకఁ బ్రకృతకథ వచ్చుచున్నది యాకర్ణింపు మట్లు శారదాపీఠంబునకు నేఁ
జను నప్పుడు తత్సన్నిధియందు. 39
సీ. ఋగ్వేదఘోషస♦మృద్ధి పెం పొకచోట, నొకచోటయాజుషా♦భ్యుదయమహిమ
సామగానధ్యాన♦చాతుర్య మొకచోట, నొకచోట నాథర్వ♦ణోక్తిగరిమ
గృహ్యసూత్రనిపాఠ♦ఖేలనం బొకచోట, నొకచోట శబ్దతం♦త్రోపచయము
జ్యౌతిషసిద్ధాంత♦సంఘర్ష మొకచోట, నొకచోట ధర్మశా♦స్త్రకలనంబు
తే. లుభయమీమాంసలప్రసంగ ♦ మొక్కచోట
నొక్కచోటను బటుతర్క♦యుక్తికథలు

యోగసద్గోష్ఠి యొకచోట • నొక్కచోటఁ
గావ్యకలకల మొప్పారఁ • గనుచు నంత. 40

సీ. పదవర్ణసౌష్ఠవ•ప్రకటనం బెంతయు, నింపు మీఱంగ రు • వ్వెచ్చి యిచ్చి
తగ నుదాత్తాదిభే•దములు గొంటక పర్వఁ, గనుబొమ్మచేష్టలఁ • గఱపి కఱపి
యెడ నెడలఁ గవళ్ళఁ • దడఁబడకుండంగ, గుఱుతులు మదిఁ బాదు•కొలిపి కొ...
నిజశిక్షులో బుద్ధి • నిలక విస్వరములు, పలికిన బుగ్గలు • నులిమి నులిమి

ఆ. యొక్కమండపమున • నుజ్జ్వలబ్రహ్మవ, ర్చసముతోడ బ్రహ్మ•చారులకును
బరమనియమవృత్తి•పరత వేదముఁ జెప్పు, చున్నయట్టియొక్క•యొజ్జఁ గాంచి.

క. కని డగ్గఱఁ బోయిన నా, యన రా రమ్మనుచు నెవ్వ • రయ్యా మీరల్
ఘనతేజంబున నొప్పెద, రనుచుం జోటిచ్చి మత్కు•లాఖ్యలు వినియెన్. 42

క. విని పూజ్యులు వచ్చిన యపు, డు ననధ్యాయ మని యప్పు•డు వటుప్రకరం
బును జదువు మాన్చి నాతో, ననుగుణవిహితోపచారుఁ • డై వర్తిలఁగన్. 43

సీ. మెఱుఁగాఱుముంజియు• మేనికోమలికంబుఁ, గడుఁదిట్టగుణముగు• ల్కెడు మొ...
పసపుగోచులయొప్పు•బ్రహ్మతేజంబును, జారుకృష్ణాజిన•ధారణంబు [2ు
తళుకుజన్నిదము మే•ధావిబొట్టును జిన్ని, పట్టవర్ధనమును • జిట్టితమ్మపు
మొలవంకయుంగరం•బులసొంపు దండపుఁ, గోలయు సన్నపు•వ్రేలుసిగయు

ఆ. నొప్పుబ్రహ్మచారి•యొకఁడేగుదెంచెఁ బు, స్తకముఁ గొంచుమిగుల•సంభ్రమమున...
నొజ్జ యతనిఁ జూచి • యోరి యేమిర కడు, నాలసించి తనియె • ననిన నతఁ...

వ. ఏ నాలసించుటకు నిమిత్తంబు చాలఁ గలదు మీకేమియు వినఁబడదు గా...
యు వినిపించెద వినుం డని పలికి యిట్లనియె నట్లు మీరు ననిచిన నేఁ జను...
ప్పుడు శాలీనుండు తమపువ్వుఁదోఁటలోన నొక్కలతాగృహంబునందుఁ దన ...
దంబులు సుగాత్రి వేడుకతోడఁ దొడలమీఁద నిడుకొని యొత్తుచుండ ...
సల్లాపంబుల నలరుచుండి నన్నుం జూచి నగుచు నుపాధ్యాయులు పుస్తకం...
నకుఁ బంచిరే యది యిక్కడన యిదే డాచినాఁడనని తమయుపరిభాగ...
జూపికొంచుఁ బోదువు గాని యటఁ గూర్చుండు మని యెదుట నున్నయొక్క...
హారవేదికతోడి లేమావినీడఁ జూపినఁ గూర్చుంటి నంతఁ దనయింతిమాఁ...
జే యిడి యాయమ కిట్లనియె. 45

క. అమృతము సేవించితివో, రమణీ యేమైనసిద్ధ•రస మబ్బెనొకో
కౌమరుంబ్రాయము మిక్కిలి, గోమరొందెడుదినముకొ త్త•క్రొత్తగ నెలనా...

క. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మండ్రు • మానవతీ ...
జిగిబిగువు లంతకంతకు, మిగులఁగఁ బొలుపొందుటకు ని•మిత్తముఁ జెప్పుమా.

వ. అనుటయు నవ్వనిత చిఱునవ్వుతోడ నాయనం జూచి. 48

లయ్యగ్రాహి. ఏ నెఱుఁగ నేమియును ♦ దీనికి నిమిత్తము న♦నూనమమతామహిమ♦
చే నైనఁ దోఁచుఁ, లేనికొమరుందనము ♦ లేనిచెలువంబు నన ♦ నోనెలఁత
యాగతిన ♦ లేనియవి గావి, మ్మనిపప లీవెఱుఁగ ♦ వేని వినుపింతు విను ♦ దీనికి
నిమిత్త మది ♦ యేన యనుచుఁ శా, లీనుఁడు సుగాత్రి దన♦పై నొరుఁగ వంచి
చెవి♦లో నొకటి యే మనుచు♦నో నగుచుఁ జెప్పెన్. 49

ఉ. చెప్పిన మోముఁ ద్రిప్పి కను♦చిత్రము నొందుచు నాథువక్త్రముఁ
దప్పక చూచి యే నొకటి ♦ తన్ మును వేఁడిన సమ్మతించెఁ దా
నప్పలు కేమి సేయునొకో ♦ యాజగదంబ యిఁకన్ వినుం డదిన్
జెప్పెద నంచు మోము చెవిఁ ♦ జేరిచి యేమియొ చెప్పెఁ జెప్పినన్. 50

క. ఘనఘోషుఁ డగుచు నతఁ డా, వనితయుఁ దో నరుగుదేర ♦ వడిఁ జని యాచే
ర్వునను శతతాళదఘ్నం, బను పేరన్ వెలసియున్న ♦ హ్రదమున నుఱికెన్. 51

క. పడఁతియు నాకుం గతి దన, యడుగుందామరల కాక ♦ యన్యము గలదే
విడిచెదనే తను నను దా, విడిచిన నని పాఱి యుఱికె ♦ విభుఁ డుఱికినచోన్.

క. కను నెడ గావున నది యి, క్కడ వినఁబడ దేమొ నీటఁ ♦ గలవా రెల్లన్
వడి నేగి వలలచే న, మ్మడు గిటు నటు నరసి యిపుడు ♦ మగిడిరి నగరోన్. 53

వ. ఏనును దిరిగి శాలీనుండు మున్ను చూపినచోటిపుస్తకంబుఁ బుచ్చుకొని వచ్చితి
నని చెప్పిన. 54

క. విని యావిప్రవరేణ్యుం, డనయంబును శోకవిస్మ♦యవిషాదములన్
మునుఁగుచు నాశుభదంపతు, లను జెందె నె యకట యితరు♦ల కెఱుంగనుచున్.

చ. అదె శతతాళదఘ్న మను♦సార్థపునామము తోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గని♦నట్టిది యందును బడ్డవారికిం
బ్రదుకులె యంచుఁ దప్పదు పు♦రాకృత మెవ్వరికైన నంచుఁ గొం
తదడవు గుందెనే నవుడు ♦ తద్ద్విజముఖ్యునిఁ జూచి యొయ్యనన్. 56

క. అనఘా యాశాలీనుం, డనఁగ సుగాత్రి యన నెవ్వ ♦ రాదంపతులన్
వినుతించెదు కథనుత్తము, లని తత్కథఁ జెప్పవలయు ♦ నంటి ననుటయున్.

క. ఆయనఘులచరితము గా, దే యీపుస్తకములోని♦దియు మాకు నిఁకన్
శ్రేయస్కర మది వినుటయుఁ, బోయెం దద్దర్శనంబు♦పుణ్యోత్సవముల్. 58

వ. అని యాబ్రహ్మచారి తెచ్చినపుస్తకంబుఁ బుచ్చుకొని శిరంబున మోపుకొని కన్నుల కద్దుకొని తిరుగ నతని చేతికి యిచ్చి చదువు మనుటయు నతం డిట్లనుచుం జదివె. 59

సీ. కాశ్మీరభూమికిఁ ♦ గర్ణిక యగు శౌర, దాపీఠమున శార♦దను భజించు
పూజారి బ్రాహ్మణు♦పుత్త్రి యొకర్తు సు, గాత్రి నాఁ బరఁగెడు♦కాంత గలదు
దానివరుండు శా♦లీనాహ్వయుం డిల్ల, టపుటల్లుఁ డత్తయిం♦టను వసించు

నాతండు దనకడ ♦ కాకన్యఁ బ్రథమసం, గమవేళఁ గను నలం♦కారకలితఁ

ఆ. జేసి యనిపి దాని♦ చెలు లింతటంతటఁ, బొంచి యుండఁ దద్వి♦భూషణాగి
మహిమఁ దలఁకిపట్ట ♦ మదిని సంకోచించెఁ, దరుణి యుండియుండి ♦ తిరిగిపోయె.

ఉ. పోయినఁ దద్విధం బఖుసు ♦ బోంట్లు తదంబకుఁ జెప్పి భూమిలో
నేయెడ లేనిచంద మిది ♦ యేమినిమిత్తమొ యంచు మాంచిలేఁ
బ్రాయపువాఁడు గల్గె భళి♦రా యితఁ డంచు నెక్లైన నేఁటికిఁ
బోయెనో కాక యెల్లి తమ♦ పోకలు చూడమ యంచు నవ్వినన్. 61

క. ఆయన వినఁ బ్రేలెదరు సుఁ, డీ యిట్లు గయాళులార ♦ డిగవిడుతురు ల
జ్జాయుతులు సర్వమును దము, నేయెడ హాసాస్పదం బొ♦కింత ఫ్వరసినన్. 62

తే. అని పలికి రెండుమూఁడునా♦ళ్లట్ల యనిపె, నల్లునొద్దకుఁ బుత్త్రిక♦నపు డతఁ...
నాది నేభావమునఁ జూచె ♦ నట్ల చూచె, వట్టి రాకపోక,లొనర్చె ♦ వానిసఖియు.

వ. అంత లజ్జావతికిఁ దజ్జననియనుమతిఁ బ్రియవయస్య లేకాంతంబున ని ట్లనిరి. 64

ఆ. పొలఁతి యాలిమగని♦పోఁడుము లేమియుఁ, గలిగినట్టిచొప్పు ♦ గానరాదు
మీ తెఱంగు చూడ ♦ మేత్తేలు దంపతు, లిరువురును వివేకు ♦ లేమి చెప్పు. 65

క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైనను, గాంతకు సిగ్గువడఁ జెల్లుఁ ♦ గాక కటకట
కాంతుఁడు సిబ్బితికాఁ డై, కాంతయు న ట్లైన నెట్లు ♦ కాఁపుర మింకన్. 66

ఆ. నలినవదన యెన్ని♦నాళ్లైనఁ జిన్నకూఁ, తురవు గాను నీవు ♦ తొడఁగి ...
దగినసేవ సేయ ♦ కగునె యూరక యుండ, నాతఁ డేమియు ననఁ♦డనుచు ...

క. మగవాఁడు భాగ్యవంతుఁడు, మగువకు నొప్పగునె యిట్లు ♦ మానవుబిగి గ
ట్టిగఁ దాల్పఁ దనంతన యూ, డిగ మిటు నటు సేయ నతని♦డెందము గరఁగున్.

క. గారామునఁ దోడ్తోడన, రా ర మ్మనఁ డనుచు మగుడి ♦ రానేటికిఁ గ
ర్వారంబుతోడిబాగా, లీగాదో యాకు మడిచి ♦ యీరాదో చెలీ. 69

క. వెంగలివి గాక నీ వో, యంగన భోగములపంట♦యామని యగునీ
బంగారువంటిప్రాయము, సంగతియే యకట రిత్త♦శయ్యకు నొసఁగన్. 70

క. యౌవనము గలిగినప్పుడ, పూవుంబోఁడులకుఁ బతుల♦భోగంబులు గా
కావిభవములకుఁ గొఱయే, యౌవనజాతాక్షి ప్రాయ ♦ ముడిగిన వెనుకన్.

క. అన విని యాపెడమాటల, నను నేటికిఁ జంపెదరు వి♦నక సైఁపవు నా
కనిసిగ్గునఁ బలుకుచు నాఁ, డొనరించి చూచెను దదీయ♦యుక్తుల తెఱంగున్. 72

వ. చూచి యెంతను ఫలంబు గానక యాసుగాత్రి యాయన నింకేమి ప్రపంచ...
జేసిన నెఱయ నెడసిపోవుట దక్కఁ బ్రయోజనం బేమియు లేదు నాకును మం...
గళసూత్రం బీపాటిశుభస్థితి నుండుటయ పదివే లనుచు నెంచుకొనియు వేఱొ...
క్కలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబు లని వివిధాలంకారంబు ...

స్వాహ నేమరక తాల్చుచుఁ దనతల్లి యతని నేమియు నిట్టట్టాడకుండం బ్రార్థింపు చుండె నదియును దత్ప్రార్థనావశంబునఁ బెక్కుదివసంబు లెడనెడఁ గూఁతుచేత నివారితదురాలాప యగుచు నోర్చి యోర్చి యంత నొక్కనాఁ డమ్మేలుం గుఁబోఁడితోఁడ. 73

ఉ. ఇట్టినిరర్థ నోముఁ గను • మే మనఁ బోయిన నీవు మిక్కిలిన్
దిట్టెదు నామనంబునకు • దిక్కగుచున్ మొగమొల్క నీ కిఁకన్
బుట్టెనొ యంటిమే నితని • పోఁడిమిఁ గంటిమె పట్టిగొడ్డుతా
కట్టెతెఁ జెంత యున్న నినుఁ • గాఁకయ పెట్టుట వెళ్లఁగొట్టినన్. 74

ఉ. పూవులకోఁటకై సనుట • పొంత విచారము చేసి రమ్మనం
గావలయుం గదా యనుచు • గారవ మొప్పఁగ నట్లు పిల్చి ము
న్నావిధ కంప యంపుఁ గల • యట్టిపనుల్ సకలంబుఁ జేయ నే
ర్పానహితాలఁగఁ దా నతని • నంతటఁ గట్టడఁ జేసెఁ జేసినన్. 75

తే. దివిజనుత మైన శారదా • దేవిపూజ, కుపకరించు కార్యం బిది • యొప్పు ననుచు
నధికమోదంబుతో నతఁ • డాదరించి, సంతతంబు తదేకనిష్ఠతఁ దలిర్చె. 76

క. సనుధకి మధుమదగరిమా, సమచంచలచంచరీక • సంచయసంచా
రమనోరమసుమనోరమ, సమరంగ నాపూఁపుఁదోఁట • ననిశము బెంచెన్. 77

సీ. నిరత్తువేళల • నిరత్తుఁ బానుపౌ, దునకుఁ గాలువలు పొం • దుగ సమర్చి
త్రిన్నటంబులతిఁ • ద్రవ్వటంబులు పెట్టఁ, దగినట్టికట్టు గుం • ద్దలి గడించి
యెరుపుఁ జల్లెడువేళ • నెరుపుఁ జల్లుగ తాభి,మానుఁ డై గంపలఁ • దాన తెచ్చి
యుం స్తోత్తుపదనున • సం స్తోత్తు నెలమిఁ గా,న్పించు లేఁగొమ్మలు • వంచి వంచి
తే. నాటునోయంగవలయునో • నారుపోయుఁ, గొమ్మినాటంగఁదగు నెడఁ • గొమ్మినాఁటు
నొకటికి విసువక యంతకం • తకును హెచ్చు, సాక్తితోడను శాలీనుఁ • డవిరతంబు.

లయగ్రాహి. అంగపరిఖేదము నొంతుంగ కతఁ డీగతిఁ గ • పంగి తులసీవనముఁ • జెం
గలువలుం గేఁ, దగులును జంపకము • లుం గురువకంబులు ల • వంగములు జా
జులును • లుంగతతులుం గొ, జ్జంగులును మల్లెలును • రంగములుఁ బాటలము •
లుం గదలికాచయముఁ • దుంగతతులున్ నా, రంగములు నాదిగ ధ • రం గలు
గునట్టిహృద • యంగమబహుద్రుమకు • సుంగములుఁ బెంచెన్. 79

చ. రవికిరణాళి కెంపును జొ • రంగ నగోచర మైననీడచే
నవిరళపుష్పరేణుయుత • మై పొలుపొందుమరందవృష్టిచే
సినముగొనంగఁ దద్వనస • మృద్ధిఁ గనుంగొని యవ్వసుంధరా
దివిజకులప్రసూతుఁడు మ • దిం బరితోషము నొంది యత్తఱిన్. 80

క. ఎంతయుఁ బ్రొద్దున లేచి ని,తాంతాచరితస్వజాతి • ధర్ముఁ డగుచు ని
శ్చింతుఁ డయి గురుపరంపరఁ, జింతించి తమక్త్రజపము • చేసి ముదముతోన్.

తే. నియమమునఁ బుష్పములు గోసి ♦ నేర్పు మీఱఁ
బలు తెఱంగుల వింతవిం♦తలుగ మాలి
కలను బొందులు కందుకం♦బులు రచించి
బ్రహ్మయిల్లాలికిని సమ♦ర్పణము సేయు. ౮౨

వ. అప్పుడు సుగాత్రి పాతివ్రత్యధర్మనిష్ఠకతంబున. ౮౩

తే. తల్లిమాటలచే నిట్లు ♦ తనవిభుండు, తనువుబడలంగఁ బూఁదోఁట♦పనులు సేయఁ
జూడనోర్వక తాను న♦చ్చోటి కరిగి, తోడుపడియెద నని చూచు♦ బ్రీడనుడుగ.

వ. అప్పు డొకనాఁడు శాలీనుండు తోఁటకుం జని యుండ నాసమయంబున. ౮౫

క. ధళధళ మెఱుపులు మెఱయఁగఁ, బెళపెళ నుఱుముచుఁ బెల్లు♦పెకలునఁ బిడుగుల్
నలుఁగడఁ బడ బెడిదపుధా, రలు గలబలు వాన జలధ♦రంబులు గురిసెన్. ౮౬

చ. మిగుల జగంబు బెగ్గడిల ♦ మించెఁ దదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘసము♦దగ్రనిరర్గళఘర్ఘరార్భటీ
లగనఘనోచ్ఛలజ్జలఝు♦ళంఝుళనిర్ఝరఝర్ఝరీభవ
న్నగవిగళచ్ఛిలాగణఘు♦ణంఘుణఘోషణభీషణంబుగన్. ౮౭

సీ. ఉదధిసమేతపీ♦తోద్వాంతబాడబ, జ్వాలయితోగ్రశం♦పాలతంబు
నిర్ఘాతరవసరం♦ధ్రీకృతాజాండబ, హిర్జలభ్రమదధా♦రోర్జితంబు
నిర్జాడ్యగర్జిత♦స్ఫూర్జిఘూర్జజ్జిత, ప్రళయభైరవరట♦త్పటహరవము
జంఝాప్రభంజన♦జాతసంఘట్టన, పరిగళత్తారక♦త్కరకగణము

తే. నగుచుఘనఘనాఘనసంఘ ♦ మవ్విధమునఁ
బూని హోరాహురన బెడిదంపు♦వాన గురియఁ
గరము భూనభోంతరము చీఁ♦కట్లు గొనియె
నఖిలలోకంబు నుదకమ♦యత్వ మొందె. [౮౮

క. అటమున్న మొగులు బలియుచుఁ, జిటిపొట మని పొటపొట♦చినుకులు నా
చ్చుటయాదిగాఁగఁ దనపెని, మిటి దడియునో యని సుగాత్రి♦మిగులవగపుం ౯.

చ. అపుడు మనంబులోన నన♦యంబు పతిం దలపోసి యిట్టిఘో
రపుఁ బెనువాన నెట్లయితో ♦ ప్రాణవిభుండ య టంచు నీకుఁ బా
పపుఁబువుఁదోఁటపా ల్లైచటఁ ♦ బ్రాప్తము లయ్యెన టంచు నెంతయున్
విపులతరార్తిఁ జేడ్పడుచు ♦ నింగిఁ బొరింబొరిఁ దొంగి చూచుచున్. 90

క. ఓశారద యోపరమద, యాశాలిని యోమదంబ ♦ యారసి మత్ప్రా
ణేశు నటు చూడుమీ నీ, వే శరణము గాని యేను ♦ వేఱొం డెఱుఁగన్. 91

శా. ఈదేహంబునఁ బూర్వదేహములయం♦దేనిన్ వ్రతధ్యానదా
నాదిప్రోద్భవ మేమి యేమి గలదా ♦ యాపుణ్య మీవర్షపీ

ఘోదోషంబును మత్పతిం బొరయ కుండఁగన్ మానుపుఁగాత నే
నౌదుం గాన్పుతఁ దన్నిమిత్తసతిపా•పాక్రాంతికిన్ బాత్రమున్. 92

వ. అని హృదయంబునఁ దమకులదైవతంబైనసరస్వతిం బ్రార్థించుచు నంతట ని
లువఁ జాలక తద్వర్షఘోరతయుఁ గైకొనక యత్యంతసాహసంబునఁ దల్లియు నె
ఱుంగకుండ నిల్లువెడలి తనదుపాతివ్రత్యధర్మంబుచేత వృష్టిబాధఁ బొరయక తొ
లంగుచుండం బోలుఁ వెల్లి యైనజలపూరంబు పాయ యిచ్చుచుఁ దెరువు విడువఁ
బ్రాణవల్లభుఁ డున్న వనంబున కరిగి కడన యుండి పలికించి యప్పటియవ్వాతవ
ర్షోపద్రవం బొక్కించుకయు లేక యాత్మసంప్రార్థితబ్రాహ్మీప్రసాదవిశేషంబున
నెప్పటియట్ల శుభవర్తనంబున నున్నతనభర్తను దదారామంబును జూచి నాత
ల్లి యీసరస్వతీనిభక్తవాత్సల్యచింత ప్రకటించితే యని తత్కారుణ్యంబునకు
నుబ్బుచుఁ గ్రమ్మఱ గృహంబునకు వచ్చి తనవచ్చుటయుం బోవుటయు నెవ్వరికి
నెఱుకపడనికి వ్రీడావశంబున నడఁగి మడఁగి యథాపూర్వస్థితిఁ బ్రవర్తిల్లుచుం
డె నప్పు డప్పువ్వుఁబోఁడి గాటంబుగాలివానచేత నేకీడునుం బొరయ కునికి జను
లు వెఱఁగందుచుండి యాసుగాత్రియు మఱియు గొన్నిదినంబులు లజ్జపెంపున
వల్లభుని యిడుమపాట్ల కోర్చి యోర్చి. 93

ఉ. అంతట లజ్జ గ్రిందుపడ • నత్యధికంబుగ మించి నూనసా
భ్యంతరపూర్ణమైనపతి•భక్తికతంబునఁ దల్లిమాట యొ
క్కింతయుఁ దాను గైకొనక • యెప్పటియట్ల యలంకృతాంగి యై
యెంతయు నింపుతోడఁ జని•యెన్ బ్రియుఁ డున్నవనంబులోనికిన్. 94

క. చని యాతఁడు దా సలిపెడు, పనులకు నియకొన కున్న • బలిమి నడంగెన్
దినసొమ్ము లెల్ల నొకముఱుఁ, గున నిడి పిరిసుట్టు సుట్టు•కొనినవలువతోన్. 95

సీ. తోరంపుఁజనుదోయి • త్రుళ్ళింతల నిడంగఁ, దగుచోట్లు గుద్దంటఁ • ద్రవ్వి త్రవ్వి
వేఁగైనపిఱుఁదు బ•ల్విడిఁ జలింపంగను, వడి నిట్టు నట్టును • నడచి నడచి
యడుసుతుంపురు చెక్కు•టద్దంబులను బర్వ, మళ్లకు మడవలు • మార్చి మార్చి
నసుము లేదివియ • నకనకల్ గుడున నిం, పునఁ దగుమోఁపులు • మోసి మోసి
తే. చిఱుచెమటఁ జేర్చువింత క్రొ•మ్మెఱుఁగుతోడఁ
గొమరుమే నొప్ప సారెకుఁ • గొప్పు వదల
నేమిటికి నైనఁ దా మున్న • యేగి యేగి
యెల్లపనులు నొనర్చె నిం•పెసక మెసఁగ. 96

తే. పడఁతి సంభ్రమించుచు నిట్లు • పనులు సేయఁ
బిఱుఁదు పాలిండ్లు గొప్పుఁ గం•పించుచొప్పు
గనుఁగొనుచు నేఁచుకొనుగతిఁ • గాంతుమదిని
బెల్లుశరముల వైచె ద•ర్పించి మరుఁడు. 97

చ. అపు డతఁ డట్లు పేర్చుకుసుమాస్త్రునియుద్ధతి యోఁపలేని నె
ట్టేపడుచ యెంతమాన్చిన నెఱింగెడుదానవు గావు నీకుఁ దోఁ
టపనుల కెంతదూర మకటా యనుచుం దనయుత్తరీయవ
స్త్రపుమునికొంగునం దుడిచెఁ దన్వికపోలపుఘర్మబిందువుల్. 98

చ. తుడిచినఁ బోక మన్మథునిదుర్జనతామహిమన్ బొరింబొరిం
బడఁతిమెఱుంగుచెక్కులఁ బర్వెడుఘర్మము గాంచి యంతి నా
బడలిక చూడలేకిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నె
క్కుడుతమకంబుతోడఁ దల గ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తఱిన్. 99

క. తదనంతరంబ మిక్కిలి, పొదిగొన్నచిగుళ్లజొంపమున సొంపగుపూఁ
బొదరింటికిఁ దార్చి సతిన్, మదనమహారాజ్యభోగమహిమముఁ దేర్చెన్. 100

తే. ఇట్లు దేర్చుచు సతి నతఁ డపుడు విడక
కౌఁగిట బిగించె పైఁబయిఁ గామిఁ డడర
నివి మిగులఁ గ్రొత్త లింటికి నేగవలదె
యని ప్రియముఁ జెప్పి విడిపించుకొనియె సతియు. 101

క. విడిపించుకొని మఱుంగున, నిడినతనదుభూషణంబు లెల్లను బ్రేమన్
దొడిగి గృహంబున కల్లన, నడచెఁ బతిచరిత్రభావనల మనము మలరన్. 102

క. వసివాళ్లు వాడియప్పుడు, వసంతసమయంపుటెండవలనన్ నెఱ్ఱవోఁ
గసుగందులు గందిన నవ,కుసుమలతికవోలె మిగులఁ గోమలి యొప్పెన్. 103

వ. ఇవ్విధంబునఁ బతియనుగ్రహంబు వడసి భాసిల్లుసుగాత్రి గృహంబునకుఁ జనియె
నప్పు డప్పడంతిసఖులు ముఖవికాసాదులవలనం దన్మనోరథసిద్ధి యెఱింగి [illegible]
లాపంబుల వినోదించుచుండిరి తల్లియుం బ్రమోదంబు నొందె నంత నాఁటి [illegible]
సమయంబున నయ్యంబుజాక్షికిఁ దద్వయస్యలు కౌతుకాతిశయంబున [illegible]
టు మిగుల నలంకరించి కేళికాభవనంబున నున్నతత్ప్రియునికడ కనిపి [illegible]

సీ. గతిసంభ్రమంబునఁ గరము బెడంగుచు, నకనకల్ గుడుచు నెన్నడుముసొబగు [illegible]
గుఱుమాపుదడిమంపుఁ గోకలోఁ దోలఁగెడు,కంపమాననితంబకాంతిసొంపు
బిగువుపయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ, ద్రుళ్లుచన్నుల నొప్పుముల్లి [illegible]
చెమటచిత్తడిఁ జిట్టి యమరు కస్తురిచుక్క, బొట్టుతోడిపసపుబొట్టుసిరియుఁ
తే. గునిసి సారెకు వడఁకెడుగొప్పకొప్పు
గలిగి యాకె దన్నొకటియు సలుపనీక
తోడఁ బఱువులువాఱుచుఁ దోఁటపనులు
సేయురూపు మదిన్ హత్తి పాయకునికి. 105

ఉ. అప్పటితద్విలేపనపటాభరణాదులవైభవోన్నతుల్
రెప్పలు విచ్చి చూడక చరింపనియట్టిపరాకుచేతఁ దా

నెప్పటియట్ల యుండె నతఁ డింటికడం దడ వుండి యుండి నా
యొప్పమి యేమి సంఘటిలెనొక్కొ యటంచు విషాద మొందఁగన్. 106

తే. తొలుదొలుత నట్లు సాధ్వసాద్భుతకరంబు
లగుచు మరుసుద్ది లేకుండ నెగయ మీఁటి
పెక్కునాళ్లు తద్వాసన ప్రిదులనీని
ఘనవిభూషాదు లపు డింపు గామి యరుదె. 107

ఆ. తిరిగి యరుగఁ జూచి యరిగి యే నెచట నె, వ్వారిదాన నచట నూరక పడి
యుండ నైన నెద్దియొనరించె నది యగుఁ,గాకయనుచుఁదలపుకడనయుండె.

ఉ. ఆలలితాంగి చాలఁ దడ నచ్చట నమ్మొయి నుండి సాహసో
ద్వేలత నంతఁ జేరి కపుఁ ద్రిమ్మటచే శ్రమ మొందినారు గాఁ
బోలును బోగునా నిదురఁ బోయెదరే యని కప్పురంపుఁదాఁ
బూలముతావి భుగ్గు రని ముంచుకొనం జెవిదండఁ బల్కినన్. 109

క. పైకొన్న పరాకున నతఁ, డేకోర్కిని వచ్చి తనియె నింతియు వగతో
లోకమువారలు పతికడ, కేకోర్కిని వత్తు రనుచు నొంతయుఁ బొలసెన్. 110

క. ఓనాయక యితరంబులు, పోని మ్మాపాటి యైన బుద్ధి గలిగి నా
మానసములోనికోర్కుల, పూనిక యడిగితిరి లోకపూజిత నైతిన్. 111

మ. అకటా యే మని దూఱుదాన మిము నాథా వేగుజా మయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త ర మ్మనుట గానీ యొంటి యేమో కదా
నికటక్షోణికి నేగుదె మ్మనుట గానీ కొంతనెయ్యంపుఁబూ
నికన్నోఁ గన్నులు విచ్చి చూచుటయె కానీ లేద యొక్కింతయున్. 112

ఉ. నేఁ డలతోఁటలో నపుడు నిబ్బర మైనమదీయభాగ్యముల్
బోఁడిమి యేమిపాకమునఁ బొందెనొ మీకృప యట్లు గాంచి పె
న్వాఁడిఁ దనర్చునాచనువునన్ మిము నెమ్మొయి నంటేఁ గాని యే
నాఁడును బుణ్యసాధ్వికి గుణం బిది గా దని నే నెఱుంగుదున్. 113

న. అని పలికి యంతరంగంబున నంతకంతకుం బ్రబలుకంతుసంతాపంబున వంత నొం
దుచుఁ గొంత చింతించి. 114

క. రా యైనఁ గొంతమేల్ నా, రాయణ మీమనసుకంటె రహి నిఁక నెపుడున్
మీయంతఁ దడవెదరె యని, యాయంగన యతనిపాద మల్లన పట్టెన్. 115

ఉ. పట్టి యొకింత యొత్తుచు నె పాన్పుకడన్ వెసఁ గూరుచుండి సొం
బట్టున నొప్పునూరువులపై నిడి యొత్తి తదంఘ్రి యంతఁ జ
న్కట్టుపయిన్ ఘటించుచును గన్నులు చేరుచుకొంచుఁ జెక్కిటన్
గట్టిగ నద్దుకొంచుఁ దనగాటపుఁగూరిమిఁ దెల్పె మిక్కిలిన్. 116

క. ఎందుఁ బరా కుతుగమికిన్, సందియ మొందుచు ని దేమి♦చందమకో యం
చుం దన డెందము గొందల, మందఁగ నిందుముఖి యతని ♦ నల్లన పలికెన్.
ఉ. చిత్తము వేఱొక ర్తుపయిఁ ♦ జేర్చి మరల్పఁగ నేర కేమొ మీ
రత్తరళాక్షిఁ దెచ్చుకొనుఁ ♦ డాయక నావశ మైనఁ బంపుఁ డేఁ
దెత్తు నవశ్యముగ్ మఱియు ♦ దేవరకుం బలె నవ్వధూటికిం
దొత్తగుచుగ్ బనుల్ సలుపు♦దుగ్ నిజ మాడెద దైవసాక్షిగన్. 118
క. తుదఁ జిక్కులేల మీమది, కొద దీఱినఁ జాలు నమ్ము♦కొనవలసిన వ
చ్చెద నమ్ముకొనుఁడు న న్నో, హృదయేశ్వర యేమిచింత ♦ యిది చెల్పఁదగున్. 120
వ. అని యిట్లు పలుకుచుం బాదసంవాహన సేవలు సలుపుచుండ.
చ. అది యొకయించు కైన నర♦యంగ నెఱుంగక యాతఁ డత్తఱిన్
మదిఁ గడు నాఁటి యున్న ప్రథ♦మంపుఁదదాకృతియొప్పిదంబు లా
చెదరినవన్నెయాపనులు ♦ సేయుఘనత్వర యావినీతి యా
పదిలపుఁ బ్రేమ యారతుల♦భంగులు చాల విరాళి గొల్పఁగన్. 121
క. ఆసతియును దత్పదయుగ, ళీసంవాహనము విసువు ♦ లేక సలుపుచున్
భాసురపాతివ్రత్యగు, ణాసక్తిఁ దదన్య మెన్న ♦ కన్నిశి గడపెన్. 122
తే. అంతఁ దొలునాఁటియట్ల య♦త్యాదరమునఁ
బోయి పూఁదోఁటఁ బను లెల్లఁ ♦ జేయుచుఁ బతి
మన్ననలు గాంచి యెంచెఁ ద♦న్మతికి నట్టి
సొంపులే గాని భూషణా ♦ లింపుగామి. 123
ఆ. ఎంచి దినము నట్ల ♦ యేగి యాతోఁటలో, నట్లు పనులు సేసి ♦ ప్రాణవిభుని
నట్ల నిష్టరతుల ♦ నలరించెఁ దద్విధం, బంత నంతయును ద♦దంబ యెఱిఁగి. 124
వ. ఎఱిఁగి కూఁతుతో నేకతంబున నున్నవేళ నిట్లనియె. 125
ఉ. అమ్మ సరస్వతీవరమ♦హత్త్వమునన్ జనియించి తీవు నా
కిమ్ముగ సర్వధర్మములు ♦ నీవ యెఱుఁగుదు వంశ మెల్లఁ బూ
తమ్మగునీదుచర్య నని ♦ ధాతపడంతియె యానతిచ్చె స్వ
ప్నమ్మున వచ్చి తావకగు♦ణంబులు చూచిన నట్ల గట్టిగన్. 126
క. పెనిమిటి దేశాంతరి యై, చనినన్ భవదీయ మైన♦సంతతి నాము
ప్పున కయ్యెడు ననుచును ద, జ్జననంబున కెదురుచూతు ♦ సతతము నాత్మన్.
సీ. ఆయాశ విఫల మై ♦ పోయెనో యనియెదు, బుద్ధిని జేసి యో♦పుత్త్రి యేను
నీపతి నిటమున్ను ♦ నిన్నుఁ జేపట్టక, యుండుకాలంబున ♦ నోర్వ లేక
విసివి యే మాడిన ♦ విని సహింపక నీవు, నన్నుఁ గోపించుచం♦దంబు దలఁచి
నిలఁ బతివ్రతలలో ♦ నిలువు గలయట్టి, తల్లివి కొద వొకిం♦తయును లేదు

తే. చిన్న నాఁడను బ్రియు నొక♦చిన్నమంత
మాట యాడిన విని తాప♦మగ్న వగుదు
తద్గుణము లెవ్వ రేపాటి ♦ తడవిన విని
యలరు దొండొరుఁ బఱపి నె♦చ్చెలులు నగఁగ. 128

సీ. మఱచి తప్పియు నన్య♦మహిమ విమర్శింపఁ, జూడ వీ వన్యాని♦సొబగు వేడ్కఁ
బతిభక్తియందుఁ గీ♦డ్పడ నీవు వేఁడుదు, తత్పుష్టి యే దైవ♦తంబు గనిన
నధిపుఁడు హర్షింప ♦ హర్షింతు చింతింపఁ, జింతింతు చిక్కినఁ ♦ జిక్కు దెపుడు
గసుఁ జన విచ్చినన్ ♦ గర్వింపనీక యుం,డిన భేద మొందవు ♦ డెందమునను

ఆ. నింపుఁగడవరీతి ♦ నుండు దెపుడును గం, భీరతకుఁ గలంగి ♦ చేరనీక
పతిప్రవాసవేళఁ ♦ బాటించుకొనవు నె, మ్మేన గరగరికలు ♦ మెఱుఁగుఁబోఁడి.

క. రాతిరిపగళ్లు దృఢమనే, వాతాత్పర్యమున నున్న♦వార లటుండన్
నీతోడ మాటలాడుం, బాతివ్రత్యమునఁ గాదె ♦ భారతి కృపతోన్. 130

క. ఓతల్లి కొదన యొక్కటి, నాతలఁపునఁ దోఁచినది వి♦నన్ వలయు గుణా
న్వితుండు గానిసుతుఁడు ప్ర,సూతుం డగు నఁట యకాల♦సురతక్రియలన్. 131

ఉ. నాఁటికి నెట్టిదైనఘట♦నంబున నో నిను నెల్ల కెంతయున్
గాటపుఁగోపమున్ బెనుప♦గాఁ దను నెమ్మెయి నంటెఁ గాక పూఁ
దోఁటకు శీతగాంధ్రుసమన♦తొల్లిటివారలు లేరె నీవిభుం
నేఁటికిఁ బోనఁగానలయు ♦ నీ వటు పోవఁగ నేల నూఁతురా. 132

క. ధవళాక్షి నయసునఁ బిన్నవు గాని వివేకగుణమున♦న్ మిక్కిలి పె
ద్దవు నీకుం దెలియనియ, ట్టివిధినిషేధమ్ము లెక్క♦డివి తలపోయన్. 133

వ. అని పలికిన మొలకనగువు మొగంబున నిగురొత్తఁ దల్లిం జూచి సుగాత్రి యి
ట్లనియె. 134

చ. పరునకు నెద్దియుం పదిసు♦వర్తన గాఁగఁ దదప్రియం బస
చ్చరితము గాఁగ నెన్నుదు ని♦సర్గము నా కిది మానరాద యా
శ్వరుఁడును వేదమున్ గురుఁడు ♦ సర్వము భర్తయ యేఁ దదాజ్ఞ సు
స్థిరమతిఁ జేయుచున్ విధిని♦షేధము లెవ్వియుఁ గైకొనం దుదిన్. 135

క. విను మెయ్యదియు నిషిద్ధం, బని విడుచుట లేను విహిత ♦ మని సేయుట లే
దనుమానింపక యెద్దియుఁ, బెనిమిటి గొల్లనిది విడుతుఁ ♦ బ్రియ మొనరింతున్.

సీ. అని తల్లితోడ ని♦ ట్లాయింతి పలుకఁ ద,త్పతిభక్తిమహిమ కెం♦తయును మెచ్చి
వాణి ప్రత్యక్షమై ♦ వాత్సల్యమున మిక్కి, లిని గారవించి త♦జ్జననిఁ జూచి
యీసాధ్వివర్తన ♦ కి ట్టట్టు వంకలు, దిద్దఁ జూడకుము సు♦స్థిరత నెప్పు
పతిభక్తిచే నిజ♦పాపంబ కాదు నీ, యుభయవంశముల పా♦పోత్కరములు

తే. నెఱయ నిర్ధూతములుగ ని♦న్నెలఁత చేసె,నిదియ కాదింక నిమ్మీఁద ♦ నీసతికథ

వెలయు మత్ప్రీతికరముఁ బ♦విత్రము నయి, నేన వెలయించుదాన నం♦చానతి చ్చెన్.

క. అని యిట్లు చదివి పుస్తక,మును గట్టిక వటువు విప్ర♦పుంగవుఁడు నను
గనుఁగొని యిదిగో నయ్యా, యనఘము వారలచరిత్ర ♦ మని యిట్లనియెన్.

వ. ఆసుగాత్రిశాలీనులయందు నరవిందభవునికాంత కెంతదయ యో యెఱుంగను నాకు నద్దేవియ కలలోన వచ్చి యీపుస్తకంబు నిత్యంబును బ్రాతఃకాలంబునఁ జదువుకొను మని యిచ్చె మఱియు నప్పటం జదువ వ్రాయ నేర్చినవారి కెల్ల నా రాత్రియంద యట్ల యిచ్చినది యందఱు నిది యొండొరులతోడఁ జెప్పుకొని వెఱఁగుపడిరి నిన్న నే నాపుణ్యదంపతులసందర్శనంబుకొఱకుఁ దత్కుసుమోద్యానంబులో వారలచేతం బ్రత్యుత్థానాసనార్ఘ్యపాద్యాదివిధుల నుపచరితుఁడనై నగుచు నచ్చట నీపుస్తకంబు మఱచి వచ్చి నేఁడు రేపకడఁ జదువంబోయి తలంచుకొని యది దెచ్చుటకుం బంపిన నిట్టిఘోరంపువార్త వచ్చె నని వెండియు నయ్యుత్తముల ప్రహదపాతంబునకుఁ బెక్కులాగుల వగచె నేను నాయధ్యాపకుని వీడుకొని యప్పటికి నప్పురంబు తత్ప్రసంగాకులం బగుట యరసి నావిద్య నెవ్వరసి చూచుట కిది సమయంబుగా దని నాగలోకంబున కరిగి యంతఁ గొంతకాలంబునకు సంగీతవిద్య సవిశేషంబుగా నభ్యసింప వేడ్కపుట్టిన నారదమహామునిం గొలిచి తిరుగ దొరకొంటి నని చెప్పి మణికంధరుం డాకలభాషిణి యట్లు శాలీనుని చిత్తంబు జానపదత్వముగ్ధత్వదోషంబునం జేసి యున్నత్యంతాపూర్వవస్త్రభూషణాద్యాడంబరంబునం దలంకి తదలంకృతపత్నీరూపంబునకు నెఱయ గొలుసుకొందుటయు వెనుకఁ దోఁటపనుల నాకులితం బైనయత్తన్విచ్ఛిత్తివిలసితాకారంబున హత్తి యితరంబు నెఱుంగమి భవదీయవృత్తంబునకు దృష్టాంతంబు లని పలికి సుముఖాసత్తిం జూచి. 139

తే. నీకులస్థానవార్త గ♦ణించి చూడ
నాసుగాత్రిచరిత్రంబు ♦ నంతవట్టు
నీ వెఱుఁగ కున్కి యె ట్లన్న ♦ నేల యెఱుఁగ
నాసుగాత్రిన యే నని ♦ యాకె నగియె 140

క. అమ్మాటకు వా రందఱు, నెమ్మనములఁ జోద్య మంది ♦ నీ వాసతివే
నెమ్మెయిఁ బ్రతికితి వేమిక, తమ్మున నిమ్మాఱుపేరు ♦ దాలిచి తనుడున్. 141

సీ. శతతాళదఘ్న సం♦జ్ఞిత మైనయట్టిపె, న్మడువున నేనట్టు ♦ వడియెడుతఱి
మత్పతిపాదప♦ద్మము లాత్మలోనఁ ది, రంబుగా నిడితద♦న్యం బెఱుఁగక [లోక
మునుఁగుచో నడుమఁ గో♦ర్మొసలి మ్రింగె నది మ్రిం,గిన వెన్క నఱిగించు♦కొనఁగ
మఱునాఁడు తత్తీర♦మహిఁ బడి పొరలుచు, వెడలఁ గ్రాసినది య♦వ్వేళయందు

తే. నచట నున్నవా రిది చెప్పి ♦ రంత నేను
నెల్లజనులును వెఱఁ గంద ♦ నింటి కేగి

వాణికిని మ్రొక్కుకొనుచుంటి • వదల కెపుడు
పతి దిరుగఁ గూర్ప నింక నీ • భార మనుచు. 142

సీ. దేవి నాలీలఁ బ్రార్థింపుచుండఁగ వచ్చె, నరలు నా కప్పుడె • నాథుసేవ
యెక్కడి దీవాణి • యెటుసేసె నట్లుగా, నిష్ఠది యని విరా•గమ్ము పొడమ
వేదాంతశాస్త్రకో•విదులగోష్ఠిని గొంత, యోగశాస్త్రజ్ఞుల•యొద్దఁ గొంత
ప్రొద్దుపుచ్చుచు యోగ•ములకు నంగము లైన, యాసనాదులకు స•మర్థ మైన

తే. ప్రాయ ముడివోవుటకు వెతఁ•బడుచు నుంటి
నా కపుడు సుముఖాసక్తి•నామ మొదవె
సుముఖు లగు శాస్త్రవిదులు ని•త్యమును దత్స
మీపవర్తన గలిగి యే • మెలఁగుచునికి. 143

తే. అట్టిపేరఁ బ్రసిద్ధ నై • యంతలోనఁ, దల్లితగు లూడఁ దీర్ఘయా•త్రగ ధరిత్రిఁ
గ్రుమ్మరుచుఁ బుదనిద్దేవి•గుణములువిని, యిచటఁ జేరితిఁ గడమమీ•రెఱిఁగినదియ.

క. అమ్మాడ్కని పాతివ్ర, త్యమ్మున నుతి గనియు నిట్టి•దశ నొందితి నేఁ
గ్రమ్మఱఁ బ్రతికి యొకింతయు, నమ్మకుగుసఁగాంతుఁ జేమి•యయ్యెనొ యెఱుఁగన్.

మ. అనుచుం గ్రాహము మ్రింగి యుండ మరునాఁ • డాలీల నక్లిష్టమూ
ర్తిని రా నేర్చిన నీయసంకుచితపా•తివ్రత్యమో యుత్తమాం
గన నీనాథుని బ్రోవకున్న పెఱశం•కల్ మాను ప్రాపించె దా
తనిసొంపుం దుది నాతఁ డే నని మణి•స్తంభుండు చూపెం దనున్. 146

సీ. చూపె యే బ్రదికినఁ•జొప్పెల్ల విను మట్లు, నీమాటఁ గడు నల్గి • యేమికర్మ
వశతనో యాయల్క•నడి యాఁపలేక నే, గోద్ధతిఁ జని నీట • నుఱికితిఁ గద
యొనా వన్క నొక్కఁ•చుకంతి సేపునకు జ, లస్తంభవిద్యావి•లాసగుప్తు
నొకసిద్ధునింటిలో • నున్నట్లు యున్నను, హత్తుఁ దెజో పిధూ•తాంధకారుఁ

తే. జేరితిం జేరి యటమున్న • దూరపాత
సంభవం బైనయప్పరి•శ్రాంతిచేతఁ
బ్రక్క లెగయంగ రోఁజుచు • నొక్కక్షణము
నిలిచి కనుఁగొంటిని సమాధి•నిష్ఠు నతని. 147

తే. అంతఁ గనువిచ్చి చూచె న•న్నాతఁ డేను, బ్రణుతిచేసితిఁ జేసి త•త్ప్రణుతిసరణి
నెంబడిని జెప్పితిని నాదు•వృత్త మతఁడు, నింతకోపివే యనుచు నొ•క్కింతనవ్వి.

క. ఇది మిక్కిలి యేకాంతపు, పద మని యిట్లున్నవాఁడఁ • బయల నునుపఁ గూ
డదను క్షణమునందు నని మ, ద్వదనము దెస యంతఁ జూచి • దాక్షిణ్యమునన్.

సీ. నాఁడెల్లఁదనయొద్ద•ననునుంచుకొనినాఁడు, గురుభక్తి తెలుఁగుఁ గ•న్గొనుచు నలరి
నాకు వయఃస్తంభ•నపుమణి యొకటియుఁ, దా నెక్కసింగంపుఁ•దత్తడియును

దద్వశీకరణౌష•ధజ్ఞానమును వాద, విద్యయు నివ్వాలు • వేడ్క నిచ్చి
పొమ్మని యనిపిన•ప్పుడు గాదె యీపట్టి, మెవ్వరి వ్రేయంగ • నెత్తుకొనును
తే. వారిఁ జంపును దుద నను•వాక్యమునకుఁ
గడు నలరి మ్రొక్కి యతనియా•కర్ణనమున
నటకు మును వచ్చినట్టిసిం•హంబు నెక్కి
మడమ మొక్కింత దాఁకించు•మాత్రలోన. 150
శా. గంభీరప్రహదమ్మునం బడిన వెడలి యా•కాశంబునం బోలునా
కుంభిద్వేషిని మెచ్చి మెన్నిగల పీ•ఠోర్వీశ విచిత్రంబు లా
శుంభద్వస్తువు లెల్లఁ జూతు నని పో•చున్ వేడ్క నుండిరన్ నయిం
స్తంభంబున్ మణిచేతఁ గాంచుట మణి•స్తంభుండు నా నుప్పొంచున్. 151
ఆ. అతివ నాదుగురువు • లంగీకరించిన, యట్టిది యని మిగుల • నాదరమున
నేను నాఁడుమొదలు•గా నిట్టిసిద్ధవే, షమును వలయుచోట్ల • సంచరింతు. 152
క. ఆవేడ్కలతమి నెప్పుడు, నీవిధమె తలంప నంత • నెప్పు నెఱుఁగు ది
చ్చో వచ్చియున్న తెలుఁగులు, నావుడు నవ్వారిజాక్షి • నగి యిట్లనియెన్. 153
స్రగ్ధర. ఆశాలీనుండ వీవే • యగుట గలిగ నా•యల్లనాఁ డంత క్రోధా
వేశం బేతేర నీ వే•వికటపు బలుకుల్ • వింటి నాచేతఁ గర్ణా
భ్యాసంబుం జేరి చెప్పన్ • బ్రథమమున నయః•ప్రస్తుతుల్ చేసి గూఢా
బై శోభిల్లంగ నీ వే•మని పలికితి మా • కానతి మ్మంతనట్టిన్. 154
సీ. అని కలభాషిణిఁ • గనుఁగొని నీ విట్టు, రమ్ము నీ కారహా•స్యమ్ము మునుపు
చెప్పి తార్కాణగాఁ • జెప్పింపఁ దగు మటే, యాయన చె నని • యప్పుడపుడు
చెవిలోనఁ జెప్పంగఁ • జేరి యో హో హో యది, గాదు పాయ మత సం•గతి రాఁగ
దూరశ్రవణశక్తి • తోడ్తోడ వినియెడు, నటుగాన వ్రాసి నీ • కెట్టు లెఱుఁగ
తే. ననిన దూరదృష్టిని గను • నదియుఁ గూడ
దనుచు మణికంధరునిఁ జూచి • వినుము నీవు
మును పతనిచేతఁ జెప్పించు•కొనుతదర్థ
మంత నేఁ జెప్పెదను గాని • యనుడు నతఁడు. 155
వ. అమ్మణిస్తంభుని నేకాంతంబునకుం దోడ్కొనిపోయి యతనిచేతఁ దాన్నుడివిన
తర్కోపకారణంబును నట మునుపటిరహస్యవాక్యంబులను జెప్పించుకొని వచ్చి
సుముఖాసత్తిం జూచి యింక నీ వేమని చెప్పెదో చెప్పు మనుటయు నప్పుడా
మణి యిట్లని చెప్పె నట్లు శాలీనుండు మనువునం బనుటకు మునుపు నాతో
నేకాంతంబున నుండి ప్రసంగవశంబున. 156
క. అమృతము సేవించితివో, రమణీ యే మైన సిద్ధ•రస మబ్బె నొకో
కొమరుం బ్రాయముమిక్కిలి, కొమరొందెడుమిగులఁ గ్రొత్త•క్రొత్తగ నెలమిన్.

క. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మంద్రు ♦ మానవతీ నీ
జిగిబిగువు లంతకంతకు, మిగులఁగఁ బాలు పొందుటకు ని♦మిత్తముఁ జెపుమా.
క. అని యడిగిన నే నెయ్యది, యు నిమిత్తం బెఱుఁగ ననుడు ♦ నూరక యిట్లం
టిని గాని యేన చెప్పెద, విను మని మొగము చెవిఁ జేర్చి ♦ విభుఁ డిట్లనియెన్.
చ. అనిశము నీద యౌవనశు♦భాకృతిఁ గౌఁగిటఁ జేర్చు వేడుకన్
దనియమిఁ జేసి వేఁడితిని ♦ దక్కక నీకును గర్భ మెన్నఁడున్
జనితము కాక యుండ నల♦శారదఁ బూజ యొనర్చు వేళ వా
రనికృప నట్టు లిచ్చితి వ♦రం బని యాయమ పల్కె న త్తఱిన్. 160
క. దానన సుమ్మీ నానె, మ్మేనన్ సౌందర్యగుణస♦మృద్ధి దలిర్పం
గా నవయౌవన మెప్పుడు, గానఁబడుట యనుడు నేను ♦ గడు వెఱఁగొందన్. 161
తే. నాదుసంగంబునన నీకు ♦ నందనుండు, గలుగువర మిచ్చె నాకున♦న్నలు వసతియు
నేన వేఁడిన నొక్కనాఁ♦డిదియు నదియు, నొనరు టెట్లకొ యట్లన♦య్యనఘుతోడ.
క. నావుడు నాయిష్టమునకు, నీవు విరుద్ధముగ వరము ♦ ని ట్లడిగితె య
ద్దేవి నని దుర్దమక్రో, ధావిలమతిఁ జని యతండు ♦ ప్రాదమున నుఱికెన్. 163
క. అని చెప్పుటయు మణిస్తం, భునిమాటయు నదియు నైక్య♦మున శోభిల్లన్
విని మణికంధరుఁ డోహో, నిని సందియపడకు మితఁడ ♦ నీవిభుఁ డనియెన్. 164
సీ. ఆవధూటియును స♦ద్యఃకందళత్త్రపా, లంకృతం బగుసద్వి♦లాస మమతఁ
బతిఁ జూచి సంతోష♦భయభక్తివిసయంబు, లుదయింపఁ దగురీతి ♦ నుపచరించి
యిందాఁక నెఱుఁగ కే♦నేమియంటినొమిమ్ము,ననుచుఁ గన్నీళ్లురా♦నడఁచుకొనుచు
నడపుల మాటల ♦ నగవులమీఁయందుఁ, దొంటికై వడిఁ గొంత ♦ దోఁచుచున్న
తే. వసుధ నూనిసిఁ బోల మా♦నుసులు లేరె
యనుచు నుండుదు భాగ్య మ ♦ ట్లునికిఁ జేసి
యిప్పు డీయన్న చే ఫలి♦యించె నదియు
సజ్జనులగోష్ఠి యిహపర♦సాధకంబు. 165
క. అని మణికంధరుఁ గనుఁగొని, వినుచుండుదు మునుపు నిన్ను ♦ వేమఱు నిచ్చో
టన దూరశ్రవణబలం, బున నీయన నీదుగాన♦మున్ విని పొగడన్. 166
శా. గంధర్వుండవు జాతి నెంచఁగ శుభా♦కారంబు చంద్రత్రపా
సంధానక్షమ మద్వితీయుఁడ విఁకన్ ♦ సంగీతసాహిత్యధౌ
రంధర్యం బరయం దపస్వి వసుర♦ప్రద్వేషిభక్తుండవున్
బంధం బొక్కటి గల్గె శాప మనఁగా ♦ నాయన్న నీకుం దుదన్. 167
తే. అనినఁ దచ్ఛాపగతి కాత్మ♦యందు వగపు
దనరఁ గలభాషిణి మణికం♦ధరుని జూచి

మును కళాపూర్ణకథ నీవు ♦ వినవె ధనదు
పట్టిచే నంత యక్లేల ♦ తిట్టువడితి. 168

చ. అన నతఁ డెందు నే నెఱిఁగి ♦ నట్టిది గా దని నీకు నెచ్చటన్
వినఁబడి యున్కొనో యది వి ♦ వేకము సేయఁగ లేక పల్కెఁ ద
ట్లనుడు మదిం దలంచుకొని ♦ యా నవు నీ వెడ గాఁగఁ జొచ్చి యు
టి నిజము తత్ప్రసంగము ఘ ♦ టిల్లినయప్పుడు పల్కి యుత్సుకేన. 169

సీ. నారదుప్రథమసం ♦ దర్శనం బైనట్టి, నాఁడు తత్కథకుఁ బ్ర ♦ శ్నప్రసంగి
మే తెంచినవిధంబు ♦ నాతపస్వియు నపూ, ర్వం బిది యని యనుస్మ ♦ తించుటయు నొంది
భూతభవద్భావి ♦ భువనవస్తువు లెల్ల, నిజయోగదృష్టిచే ♦ నమ్మక గాంచు
తన కది చెప్పరా ♦ దని పల్కుటయుఁ జెప్ప, రాకయుండుటయుఁ గా ♦ రణము గాఁగ

తే. నతఁడు దెల్పిన బహుసంప ♦ దాదిఫలము
దాను వినినంతవట్టొకం ♦ తయును నీడఁ
బూన గ్రుచ్చినరీతి నా ♦ పువ్వుఁబోఁడి
చెప్పినది విని వార ల ♦ చ్చెరువు నంద. 170

వ. అప్పుడు. 171

క. మళయాళపుబ్రాహ్మణుఁ డొకఁ, డలఘువ్రతనామధేయుఁ ♦ డెందఁటికిని సం
త్కలనాకాముఁడు జపవిధి, తలఁపున నే తెంచి వినియెఁ ♦ దత్కథవిధమున్. 172

సీ. వినియా కళాపూర్ణుఁ ♦ డనఁ బట్టినుడొత, త్కథయంతయును విన ♦ గలుగుసుకృతము
సంపదర్థంబున ♦ జపము చేసిన నయ్యు, పూర్వపుకథ వినుపుణ్య మబ్బ
నది వినునట్టిభా ♦ గ్యంబు సాధించినఁ, దన్మహత్వంబుచే ♦ తను సమస్త
భోగవైభవమాత్ర ♦ ములుగాక దీర్ఘాయు, వును బుత్రపౌత్రాది ♦ ఘనవిభవము

తే. గలుగునఁట కడు మంచిమా ♦ ర్గంబు దొరికెఁ
దత్కథాశ్రవణార్థ మీ ♦ తల్లి నేఁ బ్ర
సన్నఁ గావింతు ననుచుఁ దా ♦ నలుపఁ దొడఁగె
మహిత మగుభువనేశ్వరీ ♦ మంత్రజపము. 173

క. మనమునఁ గలభాషిణియున్, దనశాపముఁ దలఁచుకొని నృ ♦ గాహాని నిచ్చోఁ
జనఁబడునో తడసిన నం, చును సిద్ధుని నతనివాలుఁ ♦ జూచి ఘనస్మృతిన్. 174

క. ఏల యిఁకఁ దడయ నీబలు, వాలు నియమమునకుఁ బ్రదిప ♦ వారాంగనయా
భీలపుశాపమునకు నను, కూలంబుగ నడచి చేర్చు ♦ కొను రాజ్యంబున్. 175

సీ. ఆమణిస్తంభుఁ డా ♦ యకఁ జూచి యీసుము, ఖాసత్తి యో హరి ♦ ణాక్షి తొలుతె
నేను నీపైఁ గత్తి ♦ యెత్తిన నిన్ను వేఁ, యక యుండ నిజగ ♦ దంబ మీఁది
యాన వెట్టదె యటు ♦ గాన నే వెఱతు నీ, పయిఁ దెగ మునుపటి ♦ శాస్త్రి చాలఁ
నని మణికంధరుం ♦ గనుఁగొని నాదువా, లొసఁగవఁ గొని యీపు ♦ యోరుహాక్షి

ఆ. చెప్పినట్లు చేసి • చేకొను మత్యంత, విపుల మైనరాజ్య•విభవలక్ష్మి
ననుచుఁ బలికె నతని•వనితయు నోమణి, కంధర యిది మంచి•కార్య మనియె.

వ. అనిన నతం డతనితోడ వెండియు నిట్లను నలకూబరుశాపానుభవంబునకుం గాచుకొనియున్నవానికి నీదుష్కార్యంబున సాధించినరాజ్యవైభవం బేమికీర్తి సుకృతంబులకు సాధకంబు నయ్యెడు నని చింతింపవల దనివార్యం బైనశాపానుభవంబు పరోపకారంబు నెక్కింప నుద్యోగించి తనయంతనచేరి యత్యంత ప్రార్థనంబు చేయుచున్నయిన్నెలంతచేత మహాదేవికి సంతర్పణము సేయుట నుష్కార్యం బనరాదు కావున నప్పడంతి చెప్పినచొప్పున నడపు మని యత్తెఱం గునఁ బఱెయుఁ బెక్కుప్రకారంబుల నొడంబఱచిన నెట్టకేలకు నాదయాళుం డియ్యకొని నియమపూర్వకంబుగా నవ్విధికిఁ గడంగెఁ గలభాషిణియు మణిస్తంభునకుఁ దదంగనకుం బ్రణామంబు చేసి కన్నీళ్లు గ్రుక్కుకొనుచు నిక్కలంకపాటు తక్కనభయంబునకుఁ గాదునుండు మిమ్ము నెప్పుడు గురుభావన నారాధింపు చుండ లేమికిం గాని యనుటయును సుముఖాసత్తియు నోయమ్మ మననెమ్మనంబులకూర్మి యింతటన పోయెనే మీఁదటనైన నీపతియు నీవుఁ గోరినట్లు మమ్ము గురుభావంబు నడుపుకొనియెద రనినఁ గలభాషిణి పునఃపునఃప్రణామంబు లాచరించి ముకుళితకరకమల యగుచు నిట్లనియె. 177

శా. పూతం బైనమదీయపుణ్యయుగ మో•పుణ్యంపుటిల్లాల నీ
పాతివ్రత్యముచందముల్ విన మదిన్ • భావింపఁగా నెట్టిదు
ర్నీతిప్రక్రియవారి కైనఁ గృపతో • నీవచ్చినం గల్గుఁ ద
త్పాతివ్రత్యము నాకు మీఁద నయినం • బ్రాపింప దీవింపవే. 178

క. నావుడుఁ బరమపతివ్రత, నై నెలయుము రాజ్యవైభ•వానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ, బ్రోవుఁడు మముబోంట్ల నీవి•భుండును నీవున్. 179

ఉ. అట్టిటు చంచలింపకు దృ•ఢాత్మత నుండు మ టంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి • యెయ్యవి పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్న దాన వతి•భవ్యవికాసము నుబ్బుఁ జూడ నిక్
గట్టిగ నెన్న దేవతవు • గాక నరాంగనవే మృగేక్షణా. 180

చ. అని తనుఁ బల్కునజ్జలరు•హాక్షిని పేర్కొని సిద్ధవక్త్రముల్
గనుఁగొని నన్ను నంపితిరె • ఖడ్గము నిచ్చెద రే యటంచు నా
తనిబలుకత్తిఁ బుచ్చుకొని • తా మణికంధరుచేతి కిచ్చి యో
గ్యనియమ గంధమాల్యవతి • యై కలభాషిణి నిర్విశంకతోన్. 181

క. తగ నాశక్తికి నభిముఖి, యగుచుం బద్మాసనస్థ • యై కూర్చుండెన్
మొగ మెంతయు వికసింపఁగ, బిగి వదలక పాదలు మదిగ•భీరత మెఱయన్.

ఉ. కాంత యనంతరంబ మణి♦కంధరుఁ గన్గొని నీ విరక్తిఁ వివి
శ్చింతత దేవి కర్పణము♦ సేయుము కొంకక దగ్గఱిల్ల కొ
క్కింతయు శంక లేక మెఱ♦యింపుము చూచెద నుద్ధతిస్ఫుర
త్స్వంతతికంఠఖండనవి♦చక్షణదక్షిణబాహుశౌర్యమున్. 183

క. సమరంబున నెదిరించిన, సమదాహితవీరవరులఁ♦ జక్కాడెడు నీ
జము మీకు నిట్టియెడలన్, భ్రమయక చేమఱవకునికి♦ [illegible]. 184

క. అని తెలిపెడికలభాషిణి, మనసు తెలివి కరుదుపడుచు ♦ మా[illegible]
మని చెప్ప నెట్టకేలకుఁ, దనమది సొలోక్కాల్పి నడచె ♦ దన్వి[illegible]. 185

వ. అప్పుడు మృగేంద్రవాహన యతని నుద్దేశించి యోమణికంధర [illegible]
లత్వంబునం జేసి యాబలిసమర్పణవిధానం బూకించుక విల [illegible]
తివి గావున జన్మాంతరమాత్రవ్యవధానంబున సద్యో [illegible]
హారాజ్యవైభవంబు లనుభవించెదు కలభాషిణియుఁ [illegible]
లేక మత్ప్రణామతాత్పర్యధైర్యాదిగుణంబులచేతను [illegible]
మామకప్రసాదవిశేషంబునం జేసి యిప్పుడు ప్రసన్నహితము [illegible]
యు నై తనబంధుమిత్రాదుల నలరించు నని యానతిచ్చి [illegible]
దికి కనువిచ్చి నలుదిక్కులు పరికించి యప్పుడు [illegible]
శవాటిభూషణాయమానస్వభవనారామభూమి [illegible]
దుచు నిది యంతయు మృగేంద్రవాహనామహాశక్తి [illegible]
లు నని యద్దేవిం గొనియాడి తనగమనాగమన[illegible]
జనంబులకు వినిపించి ఘనతరాద్భుతంబులు గావింపుచు [illegible]
రాదులు నవ్వరవర్ణినీశరీరఖండంబులు సదృశ్యంబు [illegible]
య్యాదిమశక్తిసూక్తిమహిమ పలుదెఱంగుల [illegible]
డు మృగేంద్రవాహనకు దండప్రణామంబు గావించి [illegible]
లఁ దగువిధంబుల వీడ్కొని శాపానుభవకాలంబు [illegible]
బై నతనరత్నమాలిక యచ్చట [illegible]
ష్ఠార్పణబుద్ధిని సమర్పించి విపంచి యద్దేవిగృహంబున [illegible]
బున నన్యులకుం గానరాకుండ గుప్తంబు చేసి. 186

క. అమ్మణికంధరుఁ డంత మ, నమ్మునఁ బ్రేరేచుచున్న ♦ [illegible]
పమ్మునఁ జనియెను శ్రీశై, లమ్మునకును భృగునిపాత♦[illegible]. 187

సీ. తనసుముఖాసక్తి ♦ దనకు శుశ్రూష సే, యఁగ మణిస్తంభ[illegible] ♦ [illegible]
వాహనాదేవిని♦వాసంబునందు న, త్యంతజితేంద్రియ♦త్వంబు [illegible]
యష్టాంగయోగవి♦ద్యాభ్యాసనప్రౌఢిఁ, దనరె నజ్జలజనే♦త్రయును [illegible]
వలసినపరిచర్య ♦ సలిపినతుదను ద, దాజ్ఞను మును[illegible]♦[illegible]

ఆ. వర్తనంబు ప్రేమ • వదలక తత్పరి, శీలనంబు నెపుడు • సేయుచుండెఁ
దదనిశప్రయత్న • తాత్పర్యమున నల, బ్ధావకాశుఁ డగుచు • నతనుఁ డుడుగ. 188

క. అంత మణిస్తంభుఁడు దన, యంతఃకరణంబునందు • నలరారెడు దే
శాంతరవస్తువిశేషా, త్యంతదిదృక్షన్ దిగంత • యాత్రాపరుఁ డై. 189

క. వరజవశాలిం దనకే, సరి యాకర్షించి యాత్మ • సతియుం దానుం
బరమోత్సాహమునఁ గృతా, ధిరోహుఁ డై గగనమున య • థేచ్ఛాగతులన్.

క. అరుగుచుఁ గనుఁగొనియెను భీ, కరమకరతిమింగిలాది • ఘనజలజంతూ
త్కరవిహరణభృశసాంద్రన్, నిరుపమఘుమఘుమరవాప • నిద్రుసముద్రున్. 191

వ. ఇవ్విధంబున నయ్యంబుధిం గనుంగొని తత్ప్రకారంబు కౌతుకకారణం బగుచు
సొంపు మీఱఁ దనవనిత కతం డిట్లనియె. 192

ఉ. శీకరబృంద మెంతయు న • శీతమరీచిమరీచిజాలమై
శ్రీకృతశాళధళ్య మయి • తేజరిలన్ నిజధర్మ మైనర
త్నాకరభావ మీజలధి • యంబుజలోచన చూచితే కడుం
బ్రాకట మై తనర్పఁ దన • బాహ్యవిభాగమునందుఁ జూపెడున్. 193

ఉ. ఓలలితాంగి చూడు కడు • నొప్పెడునీరము నిండఁ గాఁగఁ దాఁ
గ్రోలి తిమిప్రకాండము శి • రోవివరంబున వెల్వరించును
ద్వేలపుటూర్ధ్వధార యల • వేలుపుటేటిపయిం గుతూహల
శ్రీల మరున్న దీవిభుఁడు • చిమ్మెడుచిమ్మనగ్రోవినీ రనన్. 194

తే. ఉగ్రతిమిశిరోరంధ్రని • ష్ఠ్యూత మగుచు
నెగయుసలిలౌఘ మది యెందు • మిగుల నొప్పె
సబ్ధిపేరిటికుండలి • తాంగభోగి
యుస్సు రనఁ దనపడి గెత్తె • నో యనంగ. 195

ఉ. ఔర్వము పేర ఘోరవిర • హానల మెంతయు నంతరంబునన్
బర్వఁ దరంగబాహువులు • బారలు చాఁపుచు నీపయోధి యా
పర్వసుధాంశుబింబముఖి • భాసిలెడుం గడు నుల్లసద్రసా
ఖర్వసుపర్వసింధువును • గౌఁగిట నెంతయుఁ జేర్చు కై వడిన్. 196

మ. వికచాబ్జానన యీపయోధి శశియా • విర్భూతకాలంబునన్
సకలద్వీపవతీగణంబు యుగప • త్సంప్రాప్తినవ్యోల్లస
త్సకరీభంగపయోధరత్వమునఁ గ • న్పట్టన్ రసోజ్జృంభణా
ధికతం జేయుచు నాచరింపఁ గడఁగున్ • దివ్యాపగాశ్లేషమున్. 197

చ. ఉదకముఁ గ్రోల వ్రాలెడుప • యోదము పౌరుషకేళిసంభ్రమా
ద్భుతవిగళద్రమాకబరి • పోలిక నొప్పెఁ దటిద్విలాసముల్

మణికంధరుం డాస్వభావాఖ్యసిద్ధు నెంతయుం బ్రార్థించె నతండు నతనికి విషా
దనివారణంబుగా నిట్లనియె. 193

క. సతతముఁ బొంపొందుజయో, న్నతి యొసఁగఁడునొక్కవిల్లు • నవశరములు నీ
మతికిఁ దగినవి సృజించెద, క్షితి దత్తాత్రేయుదయక • కృత్యము గలదే. 194

శా. నీ కింకన్ సృజియించి యద్భుతపుమా • ణిక్యంబు నే నిత్తుఁ దా
నాకర్షించును నీదుసేవ గాన స • ర్వామ్నాయశాస్త్రాదివి
ద్యాకారార్థత నొప్పువారి నది యా • త్మాలోకమాత్రంబునం
జేకూర్చున్ సకలాశ్రితాళి కఖిల • క్షేమాయురారోగ్యముల్. 195

క. అని యపుడొక సింగిణి వి, ల్లును వాఁడిమెఱుంగుటమ్ము • లును గెంజాయం
దనరారు మణిశలాకయుఁ, దనమాహాత్మ్యప్రకాశి • తముగ సృజించెన్. 196

తే. ఇట్లు సృజియించి దీని ని • వెప్పు డుదయ
మొంది తట మున్న యట్ల ని • కొసరి నిత్తు
నేను గని పెట్టుకొని వచ్చి • యివి యొదవుట
యెట్లొ యెన్ని నాళ్లకొ యని • యెన్న వలదు. 197

వ. అని పలుకుచుండ. 198

సీ. అప్పుడు చేరువ • నరుగుచుఁ దద్వాక్య, ములు విని శివరాత్రి • పుణ్యకాల
శోభితమల్లికా • ర్జున దేవభజనోత్స, వాయాతు లైనమ • దాశయుండు
నతని భార్యయుఁ బురో • హితులు నచ్చోటికి, నరుదెంచి యాసిద్ధ • వరుని నామ
మడిగి యెఱింగి మ • హాసమ్మదమున సా, ష్టాంగప్రణామంబు • లాచరించి

ఆ. మాకు ఫలిత మయ్యె • మల్లికార్జునదేవు, సేవమహిమ యిపుడు • సిద్ధవర్య
నిన్ను వెదకి వెదకి • కన్నులు సాఫల్య, గరిమఁ జెందె నిచటఁ • గనుటఁ జేసి.

వ. అని పలికినంతలో నృపాలుండు. 200

మత్తకోకిల. ఏ మదాశయుఁ డన్ మహీశుఁడ • హైహయాన్వయజుండ ని
ర్భ్రామ యోగయనఘాత్మ మత్ప్రియ • భార్య వీరు పురోహితుల్
ధీమహత్త్వగుణాభిరాములు • దివ్యతేజులు ఋగ్యజు
స్సామతుర్యమహాగమక్రమ • సంప్రదాయధురంధరుల్. 201

క. ఓయనఘాత్మక దత్తా, త్రేయమహామునిని మాహి • ష్మతీపురనిలయున్
డాయయు నేనును నిరత, హాయతఁ గొలిచితిమి బహువి • ధారాధనలన్. 202

తే. కార్తవీర్యార్జునుఁడు చక్ర • వర్తి యగుచు
నంత ఘనుఁ డౌట నాయోగి • నాశ్రయించి
కాదె తద్రాజకులజుఁడఁ • గాన నేను
నమ్మునీంద్రు భజించితి • నవ్విధమున. 203

వ. ఆదత్తాత్రేయుం డంతట నాకుం గలలోనం గానుపించి మదీయభక్తునకు స్వభావుం డనుసిద్ధుం డొక్కరుండు గలం డతనివలన నీకాంక్షితార్థం బీడేఱు నతనిసందర్శనంబు సాధించునది యని చెప్పిన నేను దేవరయున్నచోటును స్వరూపంబును నెఱుంగక యనేకవిధంబుల నరయుచు నిచ్చటికి నిద్దేవతామాహాత్మ్యనంబునకు వచ్చి యిప్పటిమీమాటల దత్తాత్రేయశబ్దంబు వినంబడుట నిది దెలిసిపోదము గాక యని చేర నేతెంచితిమి మాకుం జిరప్రార్థితం బైనభవద్దర్శనంబు దొరకె నింక మాయభీష్టంబులు సిద్ధించినట్లయ్యె ననఁ విని యాసిద్ధుండు తను బ్రసిద్ధునిం జేయం బన్నినగురువులపన్నుగడకు నద్భుతసంతోషంబు లంతరంగంబుల నెంతయుం గందళింప నింత భక్తవత్సలుండవే యని యమ్మునిం దలంచి కేలు మొగిచి యంత నారాజునుం జూచి యిట్లనియె. 204

క. ఏ నెవ్వఁడ నీకోరిక, లీ నైనను మద్గురూక్త • మిది యంటి గదా
యానియతిచేత నెల్లవి, గా నున్నవి యట్లొదవెడుఁ•గాని చెప్పుమా. 205

క. అనుపమ జయంబును సంతతి, యును నాయభివాంఛితంబు • లోయంచితవ
ర్తన యనుచు విన్నవించెను, జననాయకుఁ డతని కపుడు • సంయమివరుఁడున్.

వ. అటమున్న దా సృజించినధనుర్బాణంబులు మణికంధరునకుం జూపుచు నిట్లనియె. 207

సీ. మానవనాథ యీ•మణికంధరునకు భా, విభవంబునందును • విజయసిద్ధి
గావించుకొఱకు నే • నీవిలు నమ్ములు, నిటమున్న గా సృజి•యించినాఁడఁ
గావున నతని కొ•క్కనికిఁ దక్కఁగ నన్య, రాజుల కెందుఁ బ•రాజితుఁడవు
గాక నీవు జయింతు • గట్టిగ నన నట్లు, కానింపు మీకృప • గలిగినదియె

తే. చాలుఁ గడమకు మఱి యేన • చాలుదు మణి
కంధరునికి ధనుస్సాయ•కముల నపుడు
గాఁ గలజయంబు తదితర•కర్మకత్వ
మునను సిద్ధింప నేర్చునే • యనియె రాజు. 208

మ. అనఁ దద్గర్వపుమాటకుం గనలి యా•యస్త్రప్రభావంబుచే
నిను నీజన్మమునం దితండు గెలుచున్ • నిస్సంశయం బట్టు గె
ల్చినమాత్రంబును గాక యూడిగము నీ•చేతం గళత్రంబుచే
తను జేయించుకొనం గలం డనియె సి•ద్ధశ్రేష్ఠుఁ డారాజుతోన్. 209

ఉత్సాహ. అనుడుఁ దమపురోహితుల్ మ•హావిభూతితోడ నా
తనికిఁ గేలు మొగిచి యోయు•దాత్తచరిత యేమి యీ
యనకుఁ దెలియు మూఁడుమాట • లాఱుతప్పు లేమ మీ
కొనరఁ బల్కఁ గలమె యస్మ•మత్తికెల్లఁగు లెంతు రే. 210

తే. మీరు గురువుల రగుటను ♦ మిమ్ము వెదకి
కొనుచు వచ్చుట యొకటియే ♦ గుఱిగఁ జూచి
యీనృపతికోర్కె లీడేర్పు ♦ మెట్టులైన
ననుడు వారలఁ జూచి యి ♦ ట్లనియె నతఁడు. 211

ఉ. తప్పదు నాదుమాటలు వి♦ధాత లిఖించినవ్రాఁత సుండిలం
దప్పక యెల్లరాజులను ♦ దాను జయించెను మీనృపాలుఁ డేఁ
జెప్పినవానిఁ దక్క నిఁక ♦ సేవయు వానికిఁ జేయఁ జాలఁ బెం
పొప్పఁగ నాఁడు దాను దన♦యుల్లమునందు విముక్తమానుఁడై. 212

క. మీనరపతిమదిఁ గలసం, తానపుఁగోర్కియు ఫలించుఁ ♦ దత్సేవతఁజే
దానును భార్యయు నేలిక, పూనిన యొకమణివిశేష♦మును గనుఁగొనఁగన్.

వ. అనిన విని వార లొకింతఁ జింతించి. 214

శా. భూభోగంబులె యాత్మభోగములుగా ♦ మామాటయే మాటగా
నోభవ్యాత్మక మమ్ముఁ దా నడుపుకొం♦చున్నాఁ డితం డిమ్మహా
సౌభాగ్యంబుగ నున్న మాకును దగన్ ♦ సంసేవ్యుఁ డెవ్వాఁడొ దా
నీభావంబున నీతఁ డట్లు పరుఁ దా ♦ నేలించు కాలంబునన్. 215

మ. అనినన్ మీమహిభర్త యేలికయె మీ ♦ కారాధ్యుఁ డావేళ నా
తనిభూపామణి మీకు నెంతయుఁ బ్రమో♦దస్ఫూర్తి గావించుచున్
దనకున్ మీరలు నిమ్మదాశయుఁడు త♦త్సాంగత్యనిత్యోత్సవం
బునఁ బూర్ణోన్నతు లన్నియున్ మఱచి యిం♦పున్ గాంతు రత్యంతమున్.

వ. కావున మణికంధరుండు వసుంధరాపతి యగుచు జన్మించునందాఁక యథేష్ట విజయవిహారంబుల మీరాజు ప్రవర్తిల్లఁ గలం డటమీఁద మదుక్తప్రకారంబు నం దత్సేవ సేయం గలండు మీరుం దన్మణిస్పర్శమహిమంబున మహానందంబు నొందెద రని పలికి స్వభావనామసిద్ధుండు వారినందఱి ననిపి తానును మణికంధరుని వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ దద్వచనప్రకారంబున మదాశయుండును సకలశత్రుజయంబునఁ దేజరిల్లె ననిన విని యలఘువ్రతుండు మణికంధరుం డట్లు సిద్ధుని వీడ్కొని యటమీఁద నేమిచేసెఁ దద్వృత్తాంతంబు వినవలతుం జెప్పు మనుటయు. 217

ఉ. కావ్యకళారసానుభవ♦కౌశలనూతనభోజరాజ సం
స్తవ్యనవీనగానసర♦సత్వమహత్త్వమరుత్తనూజ క
ర్తవ్యవివేచనారచన♦ధార్మ్యగుణావరధర్మరాజ శా
స్త్రివ్యరసానుపాలన బు♦ధవ్రజపాలన పుణ్యఖేలనా. 218

క. కించిదుదంచితరాగదృ, గంచలరుచినూతనాత♦పాంకురరేఖా
వంచితసకలప్రతిభట, సంచయగర్వాంధకార ♦ జలధిగభీరా. 219

మణిగణనికరము. సమధికవితరణ•చతురిమగరిమ
క్రమజితరవిసుత•ఘనశితకరణా
శమదమముఖగుణ•సముదయకలనా
విమలితనిజమతి•వృతగురుచరణా. 220

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్య తనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# కళాపూర్ణోదయము.

## షష్ఠాశ్వాసము.

శ్రీమత్పదనఖకాంతి
స్తోమప్రచితానతారి♦చూడామణిని
ష్కామోద్దామప్రభావ
స్థేమశ్రీకృష్ణ నార♦సింహునికృష్ణా. 1



వ. అవధరింపు మమ్మధురలాలస యలఘువ్రతుం జూచి నీ వడిగినమణికంధరుని వృత్తాంతంబు సకలంబును వినుపించెద విను మని యిట్లనియె. 2

క. అచలధృతి నతఁడు తజ్జ్ఞుల, వచనసరణిఁ దగిననియమ♦వర్తన మమరన్
శుచి యై యాచరిడగ్గఱి, యుచితస్థితి నిలిచి యుఱక ♦ నుంకించుతఱిన్. 3

ఆ. మథనసమయఘూర్ణ♦మానాబ్ధివోలెఁ బెన్
మ్రోఁత లడరఁ బరుస♦మూఁక లెల్ల
బిట్టు గలఁగి తల్లి ♦ బిడ్డ పట్టక పాఱె
నతనిమది మహాద్భు♦తాకులముగ. 4

వ. అంత. 5

మ. బిగిచన్నుత్తులు గుత్తపుంబయిఁటలోఁ ♦ బింపిళ్లు గూయంగ శీ
ఘ్రగతిన్ భామ యొకర్తు వచ్చి యిదె యో♦గంధర్వ నీ వెందె దీ
భృగుపాతంబుఫలంబు నీపరుసవా♦రిం గావు మంచున్ ధగ
ద్ధగితాశాంతర మైనఖడ్గ మొకటిం ♦ దత్పాణి కిచ్చెన్ వెసన్. 6

వ. తదనంతరంబ. 7

సీ. చుట్టుపట్టుల నున్న♦యట్టిపెన్మ్రాఁకులు, బలువిడిమై దూరి ♦ పాఱునవియు
గండోపలంబు లు♦ద్దండవేగాధికో, ద్ధతిఁ జెక్కు లై ఱాలఁ ♦ దాఁకునవియుఁ

గరిసింహశార్దూల♦శరభాదిమృగముల, నుగ్గునూచంబుగా ♦ నుఱుచునవియు
నంతరిక్షమున న♦త్యంతంబు దట్టమై, పందిటిభాగుగాఁ ♦ బఱ్వునవియు
తే. నగుచు బలితంపుటినుపక ♦ ట్టములఁ నొప్పు
వెండిగునుపంబులో కాక ♦ వెండికట్ల
యినుపగునుపంబులో యనఁ ♦ దనరి కురిసె
నెంతయును జిత్తజల్లుగ ♦ నేదముండ్లు. 8
క. మణికంధరుండు తద్దా, రుణశలలీవృష్టి మిగులఁ ♦ గ్రొత్తయగుచు నీ
క్షణముల కత్యద్భుతగా, రణమై తనరారఁ జూచి ♦ ప్రమదము బలికెన్. 9
ఆ. చెలువ యీయపూర్వ♦శలలీప్రవర్ష మో, క్కడిది యీమహాసిఁ ♦ గాన్యమేమి
సేయు మనుచు నాడు♦చేతికి నిచ్చితే, వ్వానెవ్వ నీవు విసఁగి♦వలయు నాకు. 10
ఉ. నా విని యింక నేమియు వి♦నక రణకోవిద నీ కొకింతయున్
దావల మెద్ది యాకపట♦దైత్యుఁడు చేర్పున కేగుదెంచునే
మో వడిఁ బర్వఁ జొచ్చెఁ గను ♦ ముండులనాస యెనుఁబ్బు మింతటన్
నీవు మహాసిచేత నవి ♦ నిర్భరవేగతఁ జక్కుఁ జేయుచున్. 11
ఆ. ఏదురూపుతోడ ♦ నిదిగో నొకించుక, దవ్వునందు నాఁడు♦దగ్రనృత్తి
నీకు నెదురువచ్చు♦నాకష్టు నిటు మించి, రాకయుండఁ దానుము♦గయముతోడ.
వ. అని సత్వరంబుగాఁ బ్రార్థించిన నాయింతిఁ జూచి. 13
చ. అమరవిరోధిఁ ద్రుంతు నిదె ♦ యంగన భీరుల కెల్ల భీతి దీ
ర్చుము వెసఁ బొమ్ము నమ్ము మను♦చుం గదలెన్ రయ మొప్ప దప్పను
ర్దమరిపుఖండకాండభుజ♦దండమునందుఁ బ్రచండమండలా
గ్రము ఝుళిపించుచున్ గిరగి♦రన్ దిరుగన్ నెగవైచి పట్టుచున్. 14
వ. ఇత్తెఱంగున నత్యంతోత్సాహసంభ్రమంబునం గదలి. 15
మహాస్రగ్ధర. శలలీసందోహముం దో♦స్సమధికలఘిమా♦శ్చర్యచాతుర్యచర్యా
విలసద్ఘోరాసిధారా♦విహృతిహతము గా♦వింపుచుం బోయి నాంచెన్
శలసంతానంబు మేనన్ ♦ గగురుపొడిచి క♦న్పట్ట నున్నట్టియేమం
దులితానూనప్రసూన♦ద్యుతిశలలవనీ♦ధుర్యధాత్రీధరంబున్. 16
వ. ఇట్లు గాంచి నిరంతరాసారంబైనతద్ఘోరశలలీవృష్టి తననృపాణవిహరణవిచిత్ర
వేగంబునఁ దుత్తుమురు సేయుచు నక్కపటదానవు నుద్దేశించి. 17
క. ఓరి యవివేకి రాక్షస, యీరూపవికారవృత్తి ♦ నేమి గలదు దు
ర్వారత నీదుజగద్ద్రోహా, రంభము నిన్నుఁ జెఱుప ♦ కకట విడుచునే. 18
సీ. దిగ్గజంబులకును ♦ దేఱి చూడఁగ రాక, యేపారుగజదైత్యుఁ ♦ డేమి యయ్యె
మొగులలో నుండి య♦మ్ములవాన గురియించు, నింద్రజిద్దానవుం♦ డేమి యయ్యె
విశ్వమంతయునిండి♦వృద్ధిఁబొందుచుసురా, హితకారియగువృత్రుఁ♦ డేమియయ్యె

జగ మెల్లఁ జూపుచు◆ట్టుగ ఘనశక్తిచే, నెసఁగుహిరణ్యాక్షుఁ◆ డేమి యయ్యె

తే. వెండియును బెక్కుమాయల◆ వెలయునట్టి
వారు శంబరప్రముఖు లే◆మైరి వినవె
యకట యోరిదురాత్మ యీ◆వికృతరూప
మేమిటికి వచ్చు నిదె వధి◆యింతు నిన్ను. 19

చ. అన విని రక్కసుండు నగి◆ యక్కట యెక్కడివాఁడు వీఁ డచే
తనుఁడొ మతిభ్రమార్తుఁడొ మ◆దస్ఖలితాత్ముఁడొ పుట్టువెఱ్ఱియో
తనభుజసత్త్వ మెక్కడ య◆ధఃకృతదిక్కరివిక్రమప్రవ
ర్తను నను దాఁకు టెక్కడ వి◆ధాత కహం జెడ రేచెనో సుమీ. 20

వ. అని యతని నుద్దేశించి. 21

క. బ్రదుకఁ గోల్లకున్న రా రి, మ్మెదురుగ నిటువంటిమాట◆ లిమ్మెయి నేలా
వదరఁగ దొంతుల కోపని, గుడియలునుం గలవె నీదు◆క్రొ వ్వడఁగింతున్. 22

చ. అనుచు నొకింత మే మలచి◆ యత్యధికోగ్రశిలౌఘవృష్టిచే
మునుఁగఁగఁ జేయ దానిని స◆ముద్ధతఖడ్గవిహారచాతురీ
మనుముచుఁ జేరి తద్గళముఁ◆ ద్రుంచె నడిక్తి మణికంధరుండు త
ద్ఘనశిలజాల మాఱెఱపి◆ తక్తె వెసఁ దాఁకి గతాసుఁ జేయఁగన్. 23

క. అని చెప్పిన నలఘువ్రతుఁ, డనయుంబునుఁ గుతుకయుక్తుఁ◆ డై యెవ్వాఁ డ
ద్దనుజుఁ జాతని నారీ, తిని దునిమించినది యెవతె◆ తెలియఁగ నలయున్. 24

వ. అనిన విని యా శిశుపు వా రిరువురి తెఱంగును వివరించెద వినుమని యి ట్ల
నియె. 25

క. మహాత్మకు యాప్రత్యుఁడు, మహిషాసురుమాతులునికు◆మారుఁడు దుర్గా
నిహతుఁ డగువాని విని తా, నహితము దుర్గకు నొనర్ప◆ నాత్మం గోరున్. 26

తే. వాఁడు శల్యాసురుం డన◆ వసుధఁ బరఁగు
శల్యరూపత నునికిఁ ద◆చ్ఛలలచయము
గడ్డపాఱలకై వడిఁ◆ గానుపించి
పేర్చుట ఖనిత్రశలుఁ డను◆పేరు గలదు. 27

వ. మహిషాసురునిఁ జంపినసూడు తనమనంబునం బాయక యివ్విధంబున దుర్గ
యందు బద్ధమత్సరుం డై యారాక్షసుండు తనమనంబున. 28

చ. క్షితితల మంతయుక్ వెదకి◆ చెండుదునో వెసఁ గాళికార్చనా
వ్రతపరు లెంద ఱందఱ ని◆వారణ నెయ్యెడలందుఁ జండికా
యతనముపేరు లేక ఖల◆ మైచనఁ గూల్తునో యోర్చు టెట్లకో
మతి నొకయప్పుడుక్ విడక◆ మండఁగఁ బెట్టుచు నున్నకోపమున్. 29

ఆ. ఏను గినుకఁ బూని◆ యిట్లు గావింప నే, మనుచు నుడుకు నొకబ◆లాంతకుండు

పేదకోప మెందుఁ • బెదవులచేటుగా, కుడికి యేమి సేయ • నోపు నన్ను. 30

క. భార్గవుదీవన గన్నయ, నర్గళసద్వీపులబలమ•హత్త్వము సుమనో
వర్గమునకు లోఁబడునే, దుర్గాశక్తికిని వెఱవ • దుర్దమశక్తిన్. 31

తే. ఏయుపాయంబుచే నైన • నెచ్చరిలఁగ
నీక రాక్షసకులము ర•మేశ్వరుండు
దునుము ననుశంక యొక్కటి • మనమునందు
నున్న యది దీని కెద్దియో • యుక్తి యింక. 32

క. నీసికిఁ దగినయుపాయము, గానంబడుఁ గాక శాంతి • కందఁగఁ దనువుం
బూని చరించుట మేలా, దానవకులుఁ డయ్యు నితఁడు • ధార్మికుఁ డనఁగన్.

తే. అనువిచారంబుతో నొక•వనములోన, వాఁడు వర్తిలఁగా దైవ•వశత వచ్చె
నచటి కభినవకౌముది • యనుతుషార, కరకిరణజాప్సరోజాతి•కన్నె యొకతె. 34

ఉ. వచ్చినఁ దద్విలాసవిభ•వంబున కద్దనుజేంద్రుమానసం
బచ్చెరు వంది మున్పటిస•మస్తవిచారము దక్కి మిక్కిలిన్
హెచ్చినపచ్చవిల్తుపన • నెంతయుఁ జంచలభావ మొందఁ దా
నచ్చపలాక్షి కిట్లనియె • నద్దివిజప్రతిపక్షుఁ డయ్యెడన్. 35

ఉ. కోమలి నాకు నెట్టియెడఁ • గొట్టినపిండి సమస్తలోకముల్
నీమది కింపులైన యవి • నిర్భరశక్తిని దే సమర్థుఁడన్
నీమహనీయరూపరమ•ణీయతకుం దగునట్లు గాఁగ నే
నేమగరూపులైన ధరి•యింపఁగ నేర్తును గామరూపినై. 36

ఆ. నన్ను నేలుకొనుము • నావుడు నేమియు, ననక తన్ననాద•రానలోక
ములఁ దిరస్కరించి • జలజాక్షి యటు వాసి, చనుచునుండ నతఁడు•కనుకనిలోనె.

ఆ. నాతి యిట్లు వేఁడు•న న్నాదరింపక, పోవునిన్ను నింకఁ • బురుషుఁ డొక్కఁ
డెవఁడు నేఁ దలంక • నేరికి నెన్నిగుం, డియలు గలవు నాదు•ప్రియను జేర. 38

క. అని వెఱపించిన నది దన, మనమునఁ జల మొదవ నిన్ను • మడియించిననా
నిని దక్క నే వరింపను, విను మిది న్రాపతిన దీని • విడ నిఁక ననియెన్. 39

చ. అనుడుఁ దదుక్తిక్రూరతకు • నద్దనుజుండు గడున్ ఘనంబుగాఁ
గినిసియుఁ బోవ నిచ్చె నొక•కీడును జేయక యవ్విలాసినిన్
మనమున నెప్పు డేతెఱఁగు•నం దన కబ్బునో దానిసంగమం
బని యడియాస యాకినుక • కత్యధికం బగుచుం బ్రవర్తిలన్. 40

తే. అది మొదలు గాఁగ నాకన్య • యరయుచుండె
వాని మడియింప శక్తుఁ డె•వ్వాఁడొ యనుచు
వాఁడు దనుఁ జంపఁ బూనిన•వానిఁ జంపఁ
దనకు వర మెట్లు సాధింతు • ననుచు నుండె. 41

తే. అంతట మృగేంద్రవాహన♦యాలయమున
కతఁడు దైవవశంబున ♦ నరిగి యందుఁ
బ్రస్తర స్తంభలిఖితాక్ష♦రములు చూచి
చదువుకొనుచోఁ దదంతర♦సరణియందు. 42

క. ఈమెఱుఁగుగండకత్తెర, చే మిడిదల యిచ్చుసాహ♦సికుఁడు శిరం బ
ల్లే మగుడఁగ నదుకుకొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ ♦ గడఁగినవానిన్. 43

క. అని యెడి యర్థముఁ గనుఁగొని, తనయభిమతసిద్ధి కది ని♦దానం బగుటన్
మనమునఁ గడు సంతోషము, దనరారఁ దదుక్తరీతి ♦ దప్పక నడిపెన్. 44

తే. నడిపి తత్ఫలసంసిద్ధి♦నమ్మికఁ దన
కెందు నెదు రింక లే దని ♦ డెందమునను
గరము గర్వించి యపుడ యా♦ఖలుఁడు పూనె
నమ్మహాశక్తిఱాగుడి ♦ నవనిఁ గూల్ప. 45

క. అభినవకౌముదియును స, ర్వభూమిమండలమునందు ♦ వానిఁ దునుమఁ జా
లుభుజాబలాఢ్య నరయుచు, శుభ మగుతచ్ఛక్తిమహిమ♦సుద్ది విని మదిన్. 46

క. తనకోర్కె కెద్దియే నొక, యనుకూలం బైనత్రోవ ♦ యచ్చో సమకూ
ఱును యని యిక్కడికిని దాఁ, జనుదెంచుచు నాఖనిత్ర♦శిలునిం గనియెన్. 47

క. కని వీఁ డిక్కడి కేచోఁ, టనుండి ప్రత్యక్ష మయ్యె ♦ డగ్గఱ కెడగాఁ
జను పేరువు లేదొకో యని, మనమునఁ దలపోసె నంత♦మాత్రన వాఁడున్. 48

తే. ఆచకోరాక్షిఁ జూచి యో♦యలరుఁబోఁడి
యేను బ్రార్థింపఁ గైకోని ♦ యిట్టివానిఁ
గాని వరియింప నంటివి ♦ గర్వవృత్తి
నల్లనాఁ డొకవనములో ♦ ననుచుఁ బలికె. 49

చ. తనకపు డబ్బినట్టినర♦దర్పముచే నతఁ డట్లు వల్కి నీ
పొనరఁగ మీర లెవ్వరును ♦ నూఁకొనకుం డిటు చూచి చెప్పెదన్
నిను హరియించునట్టిమహ♦నీయబలాఢ్యుని గాని యే వరిం
ప ననుచుఁ బల్కితిం గలదె ♦ పల్కిన కెగ్గనియెన్ వధూటియున్. 50

తరల. అనిన నెగ్గని నిక నెద్దియొ ♦ యంబుజాక్షి యెఱుంగ నే
ననువుగా నలతాతికంబము♦నందు వ్రాసినవ్రాఁత గ
న్గొనుము మూర్ధము గండకత్తెర ♦ గూలఁ దన్నియుఁ గ్రమ్మఱన్
మనినయట్టినరుం గనుంగొను ♦ మాట లెవ్వియు నేటికిన్. 51

వనమయూరము. నా విని సుపర్వలల♦నామణి వెసం ద
ద్గ్రావలిఖితాక్షరక♦దంబకము నారి

ఱోవరునిమస్తకము • గొంత యదుకుర్ ర
క్తావనియుఁ జూచి కడు • నాకులతఁ జెందెన్. 52

స్రగ్ధర. ఈరీతిన్ ఖిన్నయై నా•హృదయము వెత యూ•హించి వారింప దిక్కె
వ్వారున్ లే రింక నిర్దే•వత కెయురు కృపా•వర్తనన్ నన్నుఁ బ్రోవన్
ఘోరం బంచున్ వెసం ద•త్పదముల కెఱఁగెం • బర్వునం బోయి గర్భా
గారంబుం జొచ్చి వాఁ డ•క్కడనె తనదురా•కం బ్రతీక్షింపుచుండన్. 53

వ. ఇవ్విధంబునఁ బాదంబులం బడి లేవక తనతొల్లింటిప్రతిజ్ఞాప్రకారంబును ఘని త్రశలలుండు పలికినయుల్లసంపుఁబలుకులును నతనిగర్వకారణంబును వినుపించి యోమహాదేవీ యేను వెనుకముందర గానక కళవళపడి యున్నదాన నాకు నెట్టనఁ బ్రతిజ్ఞాభంగంబు గాక యుండఁ ద్రోవ యొకటి సంఘటించి రక్షింపు మని ప్రార్థించె మృగేంద్రవాహనయు నమ్మహారాక్షసునిచేతితనసద్యోమహోపద్రవంబునకు నివారకం బగుచు నొదవినయాయువిదరాకకు సంతసిల్లు చుసినఁ జేసి యప్పటితత్ప్రార్థనంబునకు శీఘ్రప్రసన్న యగుచు ని ట్లనియె. 54

ఉ. ఈదనుజుండు దన్ను వధి•యింపఁ గడంగినవానిఁ జంపుటో
పైదలి తప్పు దుక్త మగు•పద్ధతి నిచ్చట నాత్మమస్తక
చ్ఛేద మొనర్చుకొన్న తనిఁ • జెందుఫలంబును మాన్ప వచ్చునే
నీదుప్రతిజ్ఞకుం బరిగ•ణించి ఘటించెద నొండుపాయమున్. 55

సీ. అని కొంత చింతించి • యద్దేవి యభినవ, కౌముదిఁ జూచి యో•కమలవదన
వీనిసాహసకర్మ•వృత్తికి ఫల మెన్నఁ, దనుఁ జంపఁ బూను నా•తనిని జంపు
టెంతియు కాని తా • నెట్లును వానిచే, మడియకుండఁగ నియ•మంబు లేదు
కావున నధికవి•క్రమముఁ డగువాఁడు నీ, నిని జంపి చచ్చు న•న్నియమశక్తి

తే. నీప్రతిజ్ఞయుఁ దలఁప నీ•నిని దునిమిన, తీవ్రశౌర్యవరించు టం•తియ కదమ్మ
యతనిమఱుమేన నైన నీ•ప్రతిన దప్ప, కుండ నరియింపవచ్చు నీ•కుచితవిధిని.

ఆ. ఇంక నట్టివరుని • నెన్నిక మీఱంగ, నిశ్చయింపవలయు • నీరజాక్షి
యని యొకింతచింత•యొనరించి తదుపాయ,మాత్మఁగాంచిమోద•మలరఁ బలికె.

సీ. మణికంధరుం డన • గుణనిధి యొక్కగం, ధర్వకుమారుఁ డో•తలిరుఁబోఁడి
తన కొకకారణం•బునఁ జేసి యొదవిన, యవితథోద్యమము మ•హాసి యొక్క
యిదె నాదుసన్నిధి • నిడి పోయినాఁ డని, యాయింతి కాఖడ్గ • మపుడుచూపి
నీ విది గొనిపోయి • యావీరవరుచేతి, కిచ్చి వే చంపింపు • మిద్దురాత్ము

తే. వీఁడు నీరూపుపసఁ జిక్కి•వెంట వెంట,వచ్చు నలయించుకొని పొమ్ము•వానికడకు
నెంతవిసివియు నీమీఁద•నించుకయును,వెగఁడిలఁడు డెందమున నీవు• వెగడవలదు.

వ. ఇమ్మహాఖడ్గంబు దొల్లి దత్తాత్రేయుండు స్వభావనామధేయుం డగు సిద్ధున కిచ్చె నతండు మణిస్తంభుం డనుతనయల్లుని కిచ్చె నతండును నిక్కడ నొకప్రయో

జనంబుకొఱకు గంధర్వుం డైనమణికంధరున కిచ్చె దానం జేసి యిద్దివ్యాయుధం బమ్మణికంధరునకు సంప్రదాయాగతం బగుచుఁ గార్యకారి యగు నితరులకుం బనుపు సేయదు గావున నతనిచేతిక యీవలయు నతండు నిప్పుడు శ్రీశైలంబున నొక్కశాపంబు కారణంబుగా భృగుపాతంబున కాయత్తపడుచున్నవాఁడు నీవు వేగంబ చని తత్ఫలంబు దీనిచేతనే యగు నని యాభృగుపాతంబు మాన్పి యిద్దానవువధంబునకు నియోగింపు మాగంధర్వుండు రెండవ మేనఁ గళాపూర్ణుం డనం గాసారనామధేయం బగుపట్టణంబునఁ బుట్టఁగలఁ డతనివరియించి ప్రతిజ్ఞఁ జెల్లించికొనుము పొమ్మని యనిపిన. 59

చ. పయఁట బిగించి నెన్నడుము • పైఁ బిరిచుట్టుగఁ జుట్టి కుంతలో
చ్చయము దృఢంబుగా ముడిచి • చయ్యన నచ్చటిమండలాగ్రముఁ
శయమునఁ బూని వెల్వడియె • శక్తినివాస మవక్రవిక్రమో
దయపరిభాసమాన యగు•దర్పకనైభవలక్ష్మియో యనన్. 60

తే. ఇవ్విధంబున వెలువడి • యేగుదెంచు
నట్టియాయింతిఁ గనుఁగొని • యసుర వెఱచెఁ
దనుఁ దునుమఁ బూని వచ్చెనో • యని తలంచి
దానఁ దన్నాశ మగునో య•న్దలఁపువ్రేడము. 61

చ. అతఁ డపు డాసుధాకరని•భాననఁ గన్గొని సంభ్రమింపుచుఁ
మతి గలగంగ నిట్లనియె • నాపయి వచ్చిన నీకు నిష్టమై
నతములయాస సుమ్ము నర•వర్ణిని యెందుఁ దలంక నేను దు
ర్మతి నయి నీపు నాకుఁ దెగి • గ్రమ్మగదవో యని తల్లడిల్లెదన్. 62

సీ. అనుడు నయ్యింతి యో•యసురేంద్ర నీవు నా, పాలికి నోర్వ కీ • ట్లాన లిడఁగ
నకట నీమీఁద రా • నంత యెఱుంగని, దాననే యేను నీ•తలఁపుబడిన
నడిచెద నని తన్నుఁ • గడచి చనఁగఁ ద, ద్వాక్యరీతినిజాభి•వాంఛితమున
కనుకూల మైనయ • ట్లై తోఁచుటయు నతఁ, డక్కన్య వెనువెంట•నంత నింత

తే. సరిగ నెందును నిలువక • యబ్జముఖియు
మిగుల నెడఁబాయ కొక్కొక్క•మిషముతోడ
నప్పటప్పటి కొక్కింత • యాలసించి
కూడ నిచ్చుచు నెలయించు•కొనుచుఁ జనియె. 63

శా. ఆతండుం మదిఁ దత్ప్రియాణపుతెఱం • గాత్మానురాగక్రియా
రీతిన్ మానసముం హరింపఁ జనియెన్ • శ్రీశైలపర్యంతము
ద్భూతానంగవిజృంభణంబువలనన్ • దూరత్వముం గాన కా
నాతిం జూచుచు మన్మథాతురుఁడు గా•నన్ నేర్చునే యేమియున్. 64

తే. అంతట విసివి యతఁ డాలఁ • దాఁగిఁ బిల్చి
నాతలంపు వెంబడి నీవు • నడిచె దనుచుఁ
బలికి తిది యేమి చెపుమ నీ • భంగు లిపుడు
వనిత నను భ్రమియించెదో • యనుచుఁ బలికె. 65

చ. పలికిన నేను నీతలఁపు • పద్ధతి గా కిపు డేమి మీఱి వ
ర్తిలితిఁ దొడింబడిన్ నిను వ • ధింపఁగ వచ్చెదనో యటంచు నా
కలుగుచు రాక మాను మని • యానలు పెట్టఁగ నప్పు డేను నీ
తలఁపుబడిం బ్రవర్తిలఁగ • దానవ పల్కితి తప్పు నిప్పుడున్. 66

సీ. అనినఁ గ్రోధించి యేఁ • బ్రాణభయంబున, నీ కలిగెడువాఁడ • నే వధింపఁ
జాలక నిన్ను నీ • సరణిఁ గరంబు ద, వ్వనుసరించుట నన్ను • నసదు గాఁగఁ
దలఁచెదు గాఁబోలుఁ • దెలుప నేరికి నెట్లు, తెలియయు క్తమయిది • తలఁచిచూడఁ
గావున నాలావుఁ • గనుఁగొను మనుచు నా, తరలాక్షి నప్పుడు • దాఁకకు [illegible]
ఆ. ఘోరశిలలవృష్టి • గురియించె నోడలు నీఁ, గించి యతఁడు నికట • గిరులు [illegible]
గురుతరద్రుమములు • గుది గ్రుచ్చునట్లుగ, నిఖిలజంతుతతులు • నేలఁ [illegible].

తే. ఇత్తెఱంగునఁ దనశక్తి • యెఱుకపఱచి
యిఁక వరింపక చనియదే • యీవు చనిన
చోటు లన్నియు నాబల • స్ఫూర్తిచేతఁ
బిడుగుఁ బాటినడొంక లై • పెంపడంగు. 68

ఆ. దాన నఖిలభయని • దానంబ వగుదు నీ, యన్వయమున లేని • యట్టియట్టి
గుడువ నీకుఁ దగునె • కోమలి యది యెంచి, మైన నను వరింపు • మనియుఁ [illegible].

క. అన విని యిఁక ని ట్టిటు దడ, సినకార్యము దప్పు ననుచు • శ్రీగిరికి వడిన్
జనియె నతి యింత నంతన్, దనుజుఁడు వెన్కొనియె శిలల • తతులుగురియుచు [illegible].

వ: అంత నాయింతియు నత్యంతరయంబునం జనియె నప్పు డప్పర్వతంబునందు [illegible]
త్రిమహోత్సవమునకుఁ జేరినసకలదిగ్దేశజనసముదయంబునకు వానిరాక [illegible]
ఱింగించి కన్యగతులు చూచుకొం డని పల్కి మణికంధరుం డున్నచోటు [illegible]
కించి వేవేగ నేగి యతనిచేతికిం దనచేతియమోఘోద్యమఖడ్గంబు నొసంగి [illegible]
వ్విధంబున నాశల్యాసురునిఁ జంపించి యతనిచేతఁ బొలిసినమణికంధరుని [illegible]
జన్మంబుఁ గని పెట్టుకొని యుండె నతం డంతఁ గళాపూర్ణుం డై జనియించి [illegible]
తగతిం జేరి తనపూర్వవృత్తంబు వినరించి దివంబునకుం జనక యావ[illegible]బు
నవ్విభుం డునిచినచోటన యునికికి నొడంబడి గాంధర్వవివాహవిధిని వరి[illegible]చె
నంతట మదాశయుండు స్వభావసిద్ధునివచనప్రకారంబునసకలశత్రుజయగర్వితుం
డగుచు నెందు నడ్డంబు లేక చరియించువాఁడు గతివశంబునఁ గాసారపు[illegible]బు
పై నేతెంచి యిమ్మహారాజునకుఁ బరాజితుం డై తనభార్యయుఁ దానును [illegible]

త్వంబునఁ బనులు సేయుచుండె నక్కాలంబునందు వారికి నేతదీయమణిసందర్శనమహిమవలన నే నుదయించితి నంతట నాతల్లిదండ్రులు నేలికచిత్తంబున కెడసిరి తత్ప్రకారంబున సరస్వతీకనకగర్భులసల్లాపకథయందు వినంబడినది యది యయ క్లైడసి వార లీక్రముకకంఠోత్తరపురంబు వెలువడి పోయి ప్రయాణక్షోభంబునఁ గృశత్వంబు నొంది తేఱక యున్న నన్నుం జూచి నన్నుం గొనుచుఁ దిరిగి వచ్చి నేఁ డింతకుమున్ను గా నొదవిన యేతన్మాణిక్యవిలోకనమహత్త్వంబున నే నారోగ్యంబు వొంది మిక్కిలి నెలమిం బొదల హృదయంబుల ముదంబు నద్భుతంబు నొందుచు నివ్విధంబున నవ్విభుసన్నిధి నిడి మదీయదౌర్బల్యనివర్తనప్రకారంబు విన్నవించి సన్నుతించిరి తత్పురోహితులును మణిమహిమవశీకృతు లగుచు నిమ్మేదినీశ్వరుఁ గ్రమ్మఱ నాశ్రయించి యిదె యున్నవా రని చెప్పిన నలఘువ్రతుం డబ్బాలికకుఁ గేలు మొగిచి యీదివ్యమహిమశోభిని యాపురోహితు లెవ్వరు వారి తెఱం గెఱుంగవలయు నని యడిగిన. 71

క. వారి తెఱం గే మెఱిఁగెదు, సారగుణా వారు నీదు♦సత్పుత్త్రిలు నీ
ఘోరపుభాగ్యము నిన్నును, జేరిచె నని పలికె శిశువు ♦ చిఱునగ వెసఁగన్. 72

క. ఆపలుకున కత్యాశ్చ, ర్యాపూర్ణమనస్కుఁ డగుచు ♦ నలఘువ్రతుఁ డా
పాపం గనుఁగొని వారలు, నాపుత్త్రికు లగుట యెట్లు ♦ నవ్వాక చెపుమా. 73

వ. అనిన సభాపతిం జూచి యి ట్లనియె. 74

ఆ. అంటికుంచి యాఁడు♦నట్టిప్రాయ మొకింత, నడఁచునంతలోన ♦ నాదుసతులఁ
బుణ్యశీలయుతలఁ ♦ బోకార్చుకొన్నట్టి, నాకుఁ బుత్త్రిలనుట ♦ నగవుగాదె.

చ. తలఁపక వారిపోకయును ♦ దక్కినయట్టిది గాదు వార్ధిలో
పలఁ బడి యందుఁ బడ్డదియె ♦ పాటుగఁ దీర మునింగిపోయి రే
నలఘుతదన్వయాకృతిగు♦ణాదులమక్కువ నన్యసంగమే
చ్ఛ లుడిగినాఁడఁ బుత్త్రిలను♦సంశయ మైనను గల్గనేర్చునే 76

ఆ. నాకుఁ జూడ ధరణి♦నాయక యది యసం, గతమ యీవిచిత్ర♦కథలఁ దల్లి
దీని కొనర నేగ♦తిని బట్టతలలు మోఁ, కాళ్లు ముళ్లు పెట్టఁ ♦ గలదొ కాని. 77

వ. అనుటయు నట్ల దప్ప దనుచు నవ్వీ యవ్వసుమతీధవుండు నమ్మధురలాలస నాలోకించి యోబాలికాతిలకంబ యీసందియంబు దీర నీబ్రాహ్మణునిజన్మాదివర్తనంబు నితనికిఁ బ్రథమాగమాదులు పుత్త్రి లైనప్రకారంబును వారు మదాశయునకుఁ బురోహితు లైన తెఱంగును నెఱుంగింపు మనిన నట్ల చేసెద నని యబ్బాల యి ట్లని చెప్పె. 78

సీ. జననాథ పాండ్యదే♦శమునందు నురగాఖ్య, పట్టణంబున నొక♦బ్రాహ్మణుండు
సోమశర్మాఖ్యుఁడు♦శ్రుతిపారగుఁడు తపో, యోగాధికుండు శ్రీ♦యుతుఁడుగలఁడు

తత్త్వజ్ఞుఁడయ్యు నా♦తఁడు గుప్తమాహాత్మ్యుఁ,డగుచు గృహస్థాశ్ర♦మార్హవిధులు
జగదనుగ్రహణార్థ♦ముగ నడుపుచు నందు, సతిముఖ్య మని సంత♦తాన్నదాన

తే. విధిని విప్రులఁ దనుపుచు ♦ వెలసె నతని
యాత్మజుఁడు యజ్ఞశర్మాఖ్యుఁ ♦ డతని కంట
దయ్యె వేదాదివిద్యల♦యం దొకటియుఁ
బరమయత్నంబుతో నెన్ని♦పాట్లుపడిన. 79

క. ఆదుఃఖము మఱపించుట, కై దివ్యాంగనలఁ బోలు♦నతివలఁ గులశీ
లాదిగుణాఢ్యల నలువుర, నాదరమునఁ బెండ్లిఁ జేసె ♦ నతనికి గురుఁడున్. 80

క. ఆకోడండ్రకు సొమ్ములు, కోకలు ననులేపనములు ♦ కొదవ యించుకయుక్
లేక ప్రవర్తిల నడపె న, నాకులతం గోమరుఁ డొంద ♦ మలఁగాఁడట్లకై. 81

క. కడపటిదెసయం దాతఁడు, కొడుకుఁ బిలిచి యిట్లు లనియెఁ ♦ గోడండ్రను విన
నడుపుము నీ వెట్లైనను, విడువక మనయన్నదాన♦విధినియమంబున్. 82

క. దానును జతురాగమసం, తానం బుదయించు నీకుఁ ♦ దప్పదు మచ్ఛా
చానియమం బిది యనుటయుఁ,గాని మ్మని యియ్యకొనియెఁ ♦ గపటం డతండున్.

ఉ. ఆయన తండ్రియాజ్ఞఁ దన♦యాదలఁ దాల్చి యొకప్పుడున్ మఱిం
బాయక పెంచునట్టిపితృ♦భక్తిపసం గలమాన్యముల్ హవిః
పాయసపూపసూపబహు♦పక్వఫలాదుల నంతకంత కిం
పై యమరంగఁ బెట్టె వసు♦ధామరకోటి కనేకవర్షముల్. 84

చ. పయిఁబయిఁ బాడుకొల్పువిరి♦పైఁడియు గట్టి దినస్సురాళి గ
ప్పయు మఱి బంటుబానిసలు ♦ బైరము పెయ్యలు చేలు చల్లు లో
నయినసమస్తసంపదలు ♦ నన్నవితీర్ణికి వెచ్చపెట్టఁగాఁ
బ్రియలు ధరించుసొమ్ములకుఁ ♦ బెట్టినపెట్టెఁ జలిం గంతటన్. 85

వ. ఇట్లు గడంగి పరమపతివ్రతలం దనసతులనలువుర నుపలక్షించి. 86

ఉ. ఏకలకంఠిసొమ్ము హరి♦యింతును మున్నని చింతిలెన్ సమ
స్తోకమనోనురాగతన♦తుల్ దను నంతట నాదుసొమ్ము మున్
గైకొను నాదుసొమ్ము మును ♦ గైకొను మంచుఁ గడంగి వేడఁగా
నేకలకంఠిసొమ్ము హరి♦యింతును మున్నని యట్లు చింతిలెన్. 87

వ. అప్పుడు. 88

ఉ. మంగళసూత్ర మొక్కటియె ♦ మాని సమస్తవిభూషణంబులున్
రంగదభంగురప్రణయ♦రమ్యత నొండొరు మీఱ నూడ్చుచుం
బొంగుచుఁ దెచ్చి ముందటను ♦ బో విడుకాంతలరూపు లొంటిశీ
లం గరగించెఁ గాంతుఁ బ్రక♦టీకృతభక్తియె సొమ్ము సాధ్వికిన్. 89

తే. వెచ్చ మన్న దానమ్మఁట • వేఁడువాఁ డ
దీశ్వరుండఁట తాము ప•తివ్రతలఁట
యొండొరుల మీఱి యెట్లు సొ • మ్మొసఁగు టరుదె
యది యలంకృతికంటె ర•మ్యంబు గాదె. 90

ఉ. సొమ్ములు వేఁడి పుచ్చుకొను•చోట్ల సపత్నులమత్సరంబు లో
కమ్మున నెచ్చటం గలదు • గాని నిజాభరణంబు లెల్లఁ దా
రిమ్మెయి నాథు వెచ్చమున • కిచ్చుట కొండొరు మీఱుపుణ్యపుం
గొమ్మలు వీరె యంచు జన•కోటి నుతించెను వారి సత్తఱిన్. 91

వ. ఇవ్విధంబునం దమతమసొమ్ములే మున్ను పుచ్చుకొనుటకుం ద్రికరణైక్యంబు గానుపింపం బ్రార్థించునిజసతులయందు నెవ్వరి నతిక్రమింపం జాలక యాతం డందఱిఁ బ్రియంబునం జేకొని తదాభరణంబు లన్నియు నొకమాఱు పుచ్చుకొని వెచ్చపెట్టం దొడంగెఁ దత్కాలంబున. 92

క. మతిలోఁ జతురాగమసం, తతి నీ కుదయించు ననిన•తండ్రిపలుకు సు
స్థితముగఁ దదాశకతమున, సతతము నతఁ డుండుఁ జదువు•సంధ్యలదండన్. 93

క. దానికి ఫల మపు డేమియుఁ, గానక యుండియు గురూక్తి•క్రమ మెద్దియొ యె
వ్వానికిఁ దెలియ దటంచును, దా నెప్పటియట్ల నన్న•దానము నడపున్. 94

క. ఆయజ్ఞశర్ముఁ డే సు, మ్మీయలఘువ్రతుఁడు మేది•నీశ్వర యీపే
రాయన్న దానసువ్రత, మేయెడ విడువ కునికి యపు • డితనికిఁ గలిగెన్. 95

ఉ. ఏ మని చెప్పవచ్చు నపు • డింతులసొమ్ములు చెల్లిపోవఁ ద
త్ప్రేమము నెక్కుడం జదువఁ•బెట్టెను గట్టిగ నిశ్చయించె నా
భామలఁ బట్టి యిచ్చి తన•పట్టినయట్టికడింది నేమముం
దా మదిఁ గొన్ని నాళ్లు విహి•తంబుగ నిల్పుకొనంగ మనంబులోన్. 96

వ. ఇట్లు నిశ్చయించి వారి కది యెఱింగింపక కపటమార్గంబుగ సమ్ముకొనునుపాయంబు చింతించి యొక్కనాఁడు కొమ్మలతో ని ట్లనియె. 97

ఆ. తామ్రపర్ణి రేవు•దండ నోడలు డిగి, యున్న వియఁట యేను • నువిదలార
యొకనిపొత్తు గూడి • యోడబేరము వోయె,దను సదాన్న దాన•ధనముకొఱకు.

చ. అనవుడు నిన్నుఁ బాసి క్షణ • మైన గృహంబున నుండ నోప మే
మును నినుఁ గూడి వచ్చెదము • మోదముతో మముఁ దోడుకొంచుఁ బొ
మ్మన నిది లెస్సకార్య మని • యందఱి కొక్కబెహారిచే రహ
స్యనియతి మూల్య మందుకొని • యచ్చటికిం గొనిపోయె వారలన్. 99

క. విను మధిప యిట్లు గొనిపో, యి నయంబున నెక్కునావ • యెక్కించెఁ దుదం
దన కెక్కడ నెడ లేకుం, డను మునుపటిపదరుగట్టు•డఁ గలం బరిగెన్. 100

క. పదియైదుబార లెడగా, నది యోగతిఁ గదలి పోవ • నపు డే మని చె

ష్పము నరవరశోకమహా, భిదుర మితన్నిధైర్యగిరిని ◆ బిట్టు పగిల్చెన్. 101

వ. ఇట్లు విశకలితధైర్యుండై. 102

మ. అతిదుష్టం బగునాథ నేచ్ఛ తుద నా◆హా యింతకుం దెచ్చెనే
సతులారా మిము నంచు రూపగుణవం◆శస్ఫూర్జితల్ మీర లి
ట్లతికష్టస్థితి నొంద బేహరులపా◆లై పోవ నా చెట్ట ప
ట్టితిరే యంచు మహారవం బడర నే◆డ్చెన్ శోకవేగంబునన్. 103

క. ఆయేడ్పు విని సతుల్ తము, నాయకు వంచించి యిట్లు ◆ నావ పతియుఁ గొం
పోయెడునో యని ఘనశో, కాయత్తత నలువురును మ◆హాసంభ్రమతన్. 104

క. జడనిధిలోఁ బడ నుఱికిరి, పడ నెవ్వారలును నోడిచి ◆ పట్టంగా నే
యెడఁ గానక హాహారవ, మడర మహాశోకసంభ్ర◆మాకలితులుగన్. 105

ఉ. పట్టఁగ లేమి కొండొరులఁ ◆ బల్మఱు చాల దిసంతు గొట్టుచున్
దిట్టుచు నీటిలో నలలు ◆ తీవ్రరయంబున వైచియున్ గడున్
దిట్టల నీఁతకాండ్ర జడ◆ధిన్ బడఁద్రోలియుఁ దజ్జనుల్ గరం
బట్టియెడన్ రయంబు మెఱ◆యన్ వెదకించిరి వారిఁ బల్మఱున్. 106

వ. ఇవ్విధంబునం దడవుగా వెదకి ముదితలఁ గానరైరి వారిం గొన్నట్టిసెట్టి యు
తట నవ్విప్రుని బలాత్కారంబున నాక్రమించి నీయేడ్పుకతన నింత పుట్టె నని
తన్మూల్యధనంబు గ్రమ్మఱం గొని విడిచిపెట్టె నట్టిపాట్లం బడిన యితండు తొలఁగ
సుతు లనియెడు నామాట నమ్మకె ట్లాడిన నుచితంబ. 107

క. అత్తలిరుఁబోండ్లయవ్వలి, వృత్తము వినుపింతు మింక ◆ విను మోభూపా
లోత్తమ వార త్తెఱఁగున, దత్తఱపడి నీట నుఱుకు◆తత్సమయమునన్. 108

క. బలుమీ నొక్కటి నోరన్, సలిలం బెగఁ గ్రోలుచుండఁ ◆ జని రాచెలువల్
నలువురుఁ దద్వదనములో, పలి కాసలిలంబు వెంటఁ ◆ బార్థివతిలకా. 109

ఉ. అంతన దవ్వగాఁ బఱచి ◆ యంబుచరంబు సమోషపూర్ణవ
క్రాంతరతోయ మూర్ధ్వముఖ ◆ మై ప్రవహింపఁగ మూర్ధరంధ్రని
ష్క్రాంతము చేసి తజ్జలము ◆ రాజిలె వారుణకేతులీల నా
యింతులు వ్రాల్చి రందు లిఖి◆యించిన బంగరుతీఁగలో యనన్. 110

సీ. ఆక్షీతజలవలా◆హాకముతో గగనంబు, దిరుగఁ బ్రాఁకుమెఱుంగు◆తీఁగ లనఁగ
సురనదిఁ జల్లఁ జూ◆చుసముద్రుచేతి కాశ్మీరజంబాలంపు◆చార లనఁగ
బలుసీలాలచమరుజా◆బ్బిలఁ బాగతోఁ బర్వ, తోయంధనవుమంట◆తునుక లనఁగ
నదులకుఁ గూర్మి యొ◆న్నపుసిఁడిమేల్ దెలుపువా, రధినిల్పు తెఱఁగంటి◆రేఖ లనఁగ

ఆ. విపుల మీనమస్త◆వివరనిర్గమితోర్ధ్వ, గామితతమహోదక◆ప్రవాహ
సంగతిని బయోద◆సరణికి నెగయునా, సతులు గానుపించి ◆ రతులలీల. 111

తే. మిగుల దవ్వుగ నెగసియు • మగువ లంత
నుత్తరంబుగఁ జను చున్న • యొకవిమాన
వరముమీఁదటఁ బడి రందు • గరిమ జూద
మాడుచును బోవుయువయుగ్మ • మరుదుపడఁగ. 112

వ. ఇవ్విధంబున నద్దివ్యవిమానంబుమీఁదం బడి యొక్కింతతడవునకు మూర్ఛఁ దేఱి కనువిచ్చినయచ్చెలువలతడిపలువలు చూచి యలఘుకారుణ్యంబున నద్దివ్యమిథునంబు దివ్యాంబరంబు లొసంగి యూరడించి మీ రెవ్వ రెచ్చటనుండి యిచ్చటం బడితి రని యడుగుటయు నప్పడంతులు వడవడ వడంకులు గుడుచు కులుకుఁజిలుంగులతోఁ బలుకం దొడంగిన. 113

క. తాంబూలరాగకించిచ్చుంబితతద్దంతకాంతి • సొబ గెంతయు ర
మ్యం బగుచు నందు దివ్యుని, తంబినిచిత్తమున కద్భుతం బొనరించెన్. 114

తే. మున్ను తద్రూపలావణ్య • ములకుఁ దనదు
నాయకునిచిత్త మెట్లగు • నో యటంచు
దలఁకుదివ్యవధూటి నా • తలిరుఁబోండ్ల
పలువరుస యొప్పుపలుకులు • గలఁచె మిగుల. 115

తే. ఇట్లు శంకిత యగుచు నా • యిగురుఁబోఁడి, కాంతునీక్షించి వారల • కత యటుండ
నిచ్చి నీపందె మాడుకొ • మ్మెల యాల, సింప నీయాట యోడవ • చ్చినది యనియె.

ఉత్సాహ. అని యొకింత వారిఁ జూచి • యమ్మలార యిప్పు డే
ననినమాట మీకుఁ గోప • మైన నయ్యెఁ గాని యీ
యన ననుం బరాకుపఱచి • యాటగెలువు తనదిగా
వెనుక వాదు లాడ నేను • వినఁగఁ జాల నని తగన్. 117

వ. విభునిం జూచి. 118

ఉ. ఆడితె నీదుపందె మని • హాస్తనఖప్రసరచ్ఛవిచ్ఛటా
మ్రేడితపాండురద్యుతిస • మృద్ధి గరం బమరంగఁ బాచికల్
వేడుకతోడఁ బుచ్చుకొని • వ్రేళ్లను నిట్టు నటుక్ బొరల్చి వి
భ్రాజితకలంకకంకణవి • రావము మీఱఁ గదల్చి వైచుచున్. [మనుచుఁ

సీ. నిలుమహో పొంకకు • నెత్తకమ్మా యంచుఁ, బత్తు లుక్కడు నొయ్యఁ • బలుకు
జిక్కె నీసారె నా • చే నంచుఁ జిక్కె నో, దీనిపాలిటికూడు • దిన్న ననుచు
నదె దుగ తివకుమీ • సుదతి నీ వంచు నో, నిదె సారె దాఁకె నీ • యిచ్చ యంచు
నినుమాటు దంచిన • నెసటిపోఁత లటంచు, నో నట్లయుడికెడు • గాని యంచు

తే. నిట్టిదంటమాటలు నేర్చి • తెచట ననుచు, దంటనే నాట నీసంగ • తమున నంచుఁ
దమపరస్పరసరసవా • క్యములు దనర, నెలఁత తనవిభుఁడును దాను • నెత్తమాడె.

చ. క్షపఁ గవ వాసి కుందుటను ♦ జక్కవజోళ్లమనోనురాగ మే
ల పొగడ నక్షపాతిశయ♦లబ్ధసుసంగమశారికల్ క్షణం
బపుడ వియోగ మొంది యహా♦హా వెసఁ జావఁ దొడంగెఁ దుల్యరా
గపుఁబసయుక్ బరిస్ఫుటము ♦ కాదె తదీయమ యెల్లవారికిన్. 121
ఉ. సారెకుఁ బోటు దాఁకినను ♦ జాడ్యము నొందక జోడు విచ్చి పో
సారెఁగడంకతోఁ బొడిచి ♦ చాటుచుఁ దీవ్రవరణస్ఫుర న్మహా
శారిఫలప్రఘట్టనలఁ ♦ జాలఁగ మచ్చర మెక్క నయ్యెడన్
వారలు జోదులుం బలె నొ♦నర్చిరి జూదపుఁబోరు మీఱుచున్. 122
తే. అంతఁ బతి గెల్చి తత్పణ ♦ మైనయట్టి
యాస్యమద్యసద్యోదాన ♦ మధరసంజ్ఞ
నడుగఁదల యొయ్య నూఁపుచు ♦ నన్యసతుల
యునికి గనుసన్న సూపుచు ♦ నుత్పలాక్షి. 123
ఉ. ఆమధురంపుసొంపు కడు ♦ నాత్మఁ గెరల్ప నతండు చూడ్కి నే
వేమఱుఁ దా నదల్చియును ♦ వేఁడియు మ్రొక్కియు బుజ్జగించియున్
భామిని నప్పుడే తనదు♦పన్నిదమా పురికొల్పి వారు మా
ర్మో మిడి చూడకున్కిఁ దన♦మో మొకకొంత మలంచి తెల్పుచున్. 124
చ. చెలువయు మున్న యాయితము ♦ సేసి సమీపమునందు నిడ్డయు
జ్జ్వలమణిపాత్రికామధుర♦సంబు నిజాస్యమునందు నుంచి తాఁ
జెలువునినోరి కిచ్చెఁ బెఱ♦చెల్వలు చూచెదరో యటంచుఁ జం
చలితకటాక్షవీక్షణము ♦ సారెకు వారలపై నిగుడ్చుచున్. 125
ఉ. అంతటఁ బోక పేర్చుప్రణ♦యవ్యసనం బెసకొల్పఁ గ్రోలి రా
కాంతుఁడుఁ గాంతయున్ మఱియుఁ ♦ గల్పకుజాసవముం బరస్పరా
క్రాంతమిథఃకపోలఫల♦కప్రతిబింబవిలోకనామృతా
త్యంతవితీర్ణనూతనర♦సానుభవంబున నేకపాత్రికన్. 126
ఉ, చెక్కునఁ జెక్కు హత్తి విల♦సిల్లఁగఁ దత్ప్రతిబింబవీక్షలం
జొక్కుచుఁ జెక్కువాసనల♦సొంపున నింపు జనింప జుఱ్ఱుచున్
గ్రుక్కెడుగ్రుక్కెడే మధువుఁ ♦ గ్రోలుచు మోవులు నంజుకొంచు వా
రెక్కుడు గాఁగఁ దన్పిరి ని♦జేంద్రియపంచకదైవతంబులన్. 127
ఉ. సిబ్బితిపేరు పోఁ దుడిచి ♦ సీధుమదం బపుడన్నుకొల్పుచుం
బ్రబ్బఁగ మాట లక్షరవి♦భాగము చాలక యేమొ యేమొ త
బ్బిబ్బులు గాఁగ వెల్వడియ ♦ భేదిల మానము పోలుచూపులున్
నిబ్బర మైనకెంజిగియు ♦ నేత్రములం పొదయించె వారికిన్. 128

ఉ. అంతటఁ బానపాత్రమున • నాత్మముఖంబు నధీశుమోము సీ
మంతిని చూచి యోరి పర•మానిని పానసహాయ మయ్యెనే
యింతటిలోన నీడ యది • యెవ్వతె యంచును జిహ్వ యాడ క
త్యంతము దొట్రిలం బలికెఁ • దన్మధు వానక మానె నల్కతోన్. 129

వ. అప్పు డతండు. 130

ఉ. చేడియ లెన్స చూడు పెఱ•చేడియ యెయ్యది యిందులోన నీ
నీడయ కాక యన్న నవ•నీసురభార్యలఁ జూపి యాకె నా
నీడలె వీరు నట్లయిన • నీవు ననుం బలె నొరు వీరలన్
వేడుకఁ జూతువో నలగు • వీరికి నిచ్చట నంచు భీతిలెన్. 131

వ. ఇవ్విధంబున నవ్వధూమణి మధుమదంబున మది చెదర యుక్తాయుక్తవివేకంబు లేక యాకొమ్మలవలనం దలంకుపుట్టి యులుకు డింప నుద్యోగించి కించిదవనతవదనంబుతో నధోభాగంబు పరికించునపుడు నిజవిమానయానానుసారంబున గోదావరీసరిత్సమీపపరిదృశ్యమానధర్మపురినామనగరవాస్తవ్యవారముఖ్యాకేలిసౌధంబు గగనంబుతో నొరయుచు సమీపంబున దీపింపఁ దదీయచంద్రశాలాప్రాంగణంబు చేర నాత్మీయదివ్యవిమానంబు నియోగించి యాగరితలనలువురం గ్రమంబునఁ దాన కైదండ యిచ్చి యచ్చట దించి తనచేత కనుమతింపక యిట్టటు నట్టుకొట్టుచున్న వల్లభుం జూచి యుల్లంబునం దక్కినచింత వదలి పోదండు పోదండు వీరలచేరికి జారభావంబునం గోరువాఁడు నాచేత నవశ్యంబును నొచ్చు ననుచు వాహనారోహణం బొనర్చిన నతండు నాకు నిట్టితలం పేమియు లే దిమ్ముగుదల కాహారాదు లెట్లని విచారించెదం గాని యనుటయు నాయువిద యతనికి నాసౌధోత్తమంబులోపలిపలు తెఱంగులయరలు కరంబునం జూపుచు.

చ. అదె ఘృతతండులప్రకర • మల్లవె చీరలు భూషణాదిసం
పద లవె రాజురాక కులు•ఫా యొనఁగూర్చినయట్లు మీ రెఱుఁగన్
ముదితల కేమియచ్చికము • మూఢత నిం దొరు లెవ్వి ముట్టినన్
బ్రదుకనివారు వా రనుచు • భామిని యేగె నిజేచ్ఛఁ గాంతుతోన్. 133

తే. ఆత్మవిభుచిత్తచలనశం•కాంకురంబు, వలనఁ గాదంబరీమదా•కులతవలన
వెడలుతద్వాక్యములచొప్పు • విప్రసతుల, ప్రాణశీలాదిరక్షకై • పరిణమించె.

క. ఆమగువ యట్లు పలుకుచు, నామేడన్ వారి నిలిపి • యరుగు తెఱఁగుఁ ద
త్స్వామిని యగుగణికామణి, దా మఱుఁగున నుండి చూచి • తలఁకెడుమదితోన్.

క. ఎవ్వారో దివ్యస్త్రీ, లివ్వరసౌధంబు నాశ్ర•యించి రిచటికిన్
దవ్వైతి మిచటివస్తువు, లెవ్వియు నాశింపు టొప్ప • దిఁక మా కనుచున్.

మ. తలపోఁతల్ పొడమంగ గూఢసరణిం • దత్సౌధమున్ డిగ్గి యా
తలిరుంబోఁడి తదాభిముఖ్య మమరం • దా బ్రొక్కి యిమ్మేడ నిం

పొలయక నిల్చినయమ్మలార యిపు డిం • దున్నట్టినాసర్వవ
స్తులు మీ కిచ్చితి ధారవోసి యిదె యం•చుం జల్లె దోయాక్షతల్. 137

క. చెల్లి మదీయ స్త్రైవ, ర్తిల్లెడునీచుట్టుపట్టు•గృహవసుముఖ్యం
బెల్లను మీ కొస్మిఁక మముఁ, జల్లఁగఁ జలిగాలఁ దన్ని • సాకుఁ డనియెన్. 138

క. అని యాయాచోటులఁ దన, జనులా బిలుచుకొని నెపలి • చని యానుద్ధుల్
వినుపించెఁ బట్టణములో, మనుజుల కండలకు వెలుఁగు • మనసకుఁ దనరన్.

ఆ. ఆ మెఱుంగుఁబోండ్లు • నపు డవ్విధం బెల్లఁ, జూచి యిది నిరంబు•చోద్య మనుచు
దీన జనులపాల • దేవుఁ డెందును గలఁ, డనుచు సాగెఁ జేసి•కొనుచు నరిగి.

క. వారలు తమతలవాకిటి, బోరుఁ దలుపు వెట్టి సమయ•ములఁ మెఱసి తా
రారసి పదిలము సేయుచు, నారూఢస్థితి వసింతు • నాసౌధములోన్. 141

క. శకునాదులచే నిజనా, యకపునరభిసంగమాశ • లపు డుదయింపఁగ
వికలత నొందనిధైర్యా, ధికతన్ వర్తిలి రభీష్ట•దేహాభరణ.... 142

చ. పురజను లప్పటప్పటికిఁ • బుణ్యచరిత్రల నాగలన్ విభ
స్వరమణిసౌధమార్గముల • వచ్చుచుఁ బోవుచు నుండి చూచుచుం
గరములు మోడ్చి మ్రొక్కుదురు • గాని తదీయసుహాసలక్ష్మి
వ్వరుఁ బెఱదీక పోరు మును•వార్తవిధిం బెద నిల్చి చాయమిన్. 143

శా. గంధర్వాంగనలో మరుత్సతులో య•క్ష స్త్రీలో యక్షిమెలో
నింధానద్యుతితో మెలంగుదు రటే • యెన్నాఁడు వారిస్ప్రహా
గంధిస్వాంతతఁ జూచినన్ మనఁ డటే • కన్గొం డటంచుం బ్రజల్
బంధుల్ వేళలు గాచి చూతు రతితా•త్పర్యంబునన్ వారిలన్. 144

సీ. నభమున మణివిమా•నమునఁ గ్రుమ్మరువార, లీనేఁడు బెక్కు నా • ళ్ళిచట నిలిచి
యిలలోనిజనముల•బలె వంచుకొని వార్చు, కొని గణికాదత్త • మనుభవింప
నేమిటి వ్రతమొక్కొ•యిదియెన్ని నాళ్ళకొక్కొ, యావేశ్య యెట్టిధ•న్యాత్మయొక్కొ
యేము సమర్పింప • నిట్లు కైకొని కరు, ణింతురో యని పొసి • గొనితెచ్చి

తే. పెట్టసాగిరి తద్వార•పృథివి యలికి, ముగ్గతండులపుష్పసం•ముఖ్యనితతు
లప్పటప్పటికిని వారు • నవి పరిగ్ర, హించి రాజను లరిదుగ • మేగి మ్రొక్క.

ఆ. అంతఁ గొన్నినాళ్ళ • కాపతివ్రతలకు, నలువురకును శోభ•నత్వ మొదవ
గర్భలక్షణములు • గాన్పించె బరిపూర్ణ, గర్భతయుఁ దనర్చెఁ • గ్రమముతోడ.

ఉ. గర్భములందు నుండియుఁ బ్ర•కాశత నప్పుడు నేర్పెలర్పఁగా
నర్భకు లొక్కవేళఁ జతు•రాగమసూక్తుల నొక్కవేళ శా
స్త్రార్భటి నొక్కవేళ నితి•హాసమయోక్తుల నొక్కవేళ నా
విర్భవదర్థశాస్త్రముల • వేడ్కఁ జెలంగుదు రద్భుతంబుగన్. 147

వ. అంత. 148

క. జ్యేష్ఠానుపూర్వి నార్య, శ్రేష్ఠులు పుట్టిరి శుభోల్ల♦సితలగ్నమునన్
నిష్ఠాగుణసౌభాగ్యగ, రిష్ఠల కానలువురకు ధ♦రిత్రీనాథా. 149

క. వారలకు యదృచ్ఛాసం, చారంబున నొదవి యొక్క♦సంయమి విహితా
చారము నడుపుచు శుభసం, స్కారము లొనరించె జాత♦కర్మాదికముల్. 150

వ. నామకరణసమయంబున నతం డాశిశువులయనుభావంబు దనదువిజ్ఞానదృష్టిం బరికించి వీరలు మూర్తిమంతంబు లైనవేదంబు లని నిశ్చయించియు జన్మాగమప్రకారంబు ననుసరించియు వరుస నన్నలువురకుం బ్రథమాగమద్వితీయాగమతృతీయాగమతుర్యాగము లను పేళ్లు గల్పించెఁ దన్మాతలు పూర్వకాలంబునఁ దమమామ పలికినచతురాగమసంతానశబ్దంబునకు నర్థంబు వీర యని తమలోఁ దారు సరిపుచ్చుకొని సంతసిలుచు నప్పటిసంయమీంద్రునియెఱుకకు వెఱఁగు పడుచు నక్కుమారులకు నుచితకాలంబున వచ్చియు నుపనయనసిద్ధి యొదవించుటకు నాతపస్విని వేడుకొని యట్లు సేయించి రాబ్రహ్మచారులు స్వయంప్రకాశితసకలవిద్యు లయ్యు శాస్త్రసిద్ధికొఱకు నతనియొద్దన యఖిలవిద్యలు నత్యల్పకాలంబులోపలన యధ్యయనంబు చేసి రంతఁ దన్మాత లెంతకాలంబున నిట్లున్నను దమ పెనిమిటిసమాగమంబు దుర్లభంబ యని విచారించి యచ్చోటు విడిచి యెచ్చటికేనియుం బోవఁ దలంచి యది తమకుమారులఁ బిలిచి తెలిపించిన వార లిట్లనిరి. 151

క. పెద్దతల లేక మీ రీ, నిద్దపురూపముల నెచట ♦ నిల్పిన మనకుం
బెద్దఱికము చాలదు పెఱ, సుద్దులు గల్పింతు రందు ♦ సుజనులు గలరే. 152

క. కావున నిచటన మీ రీ, దైవతవనిత లనుగుట్టు ♦ దప్పక యుండన్
ద్రోయుఁడు దివసము లే మొక, భూవరుఁ గని వైభవంబు ♦ బొందెడుదాఁకన్.

తే. అపుడు గాని మాతండ్రి యు♦న్నట్టిచోటు
నరసి సంధించుకొనుటకు ♦ వెరవుపడదు
తప్ప దిది యని వారలు ♦ తమనివాస
మొరు లెఱుఁగ కుండ వెలువడి ♦ యరిగి రంత. 154

వ. అట్లరిగి యాబ్రహ్మచారులు నలువురు పురంబులోనం గొంతసంచారంబు చేసి యప్పు డది యేలెడురాజు మదాశయుండు గావున నతనివాకిటికిం జని యతండు సకలవిద్యావిశేషజ్ఞుం డనియుఁ దద్దర్శనంబు పురోహితునియనుమతి లేక బ్రాహ్మణుల కెవ్వరికి దొరక దనియు నతండు దాను విద్యాధికుండు కాకుండుటం జేసి నిజగౌరవశైథిల్యభయంబున నితరు లగువిద్యాధికులకు రాజగృహంబునం బ్రవేశంబు లేకయుండ దౌవారికాదిసకలపరిజనచక్రంబును వలకట్టుకొని యుండుటయుఁ బ్రభువునకు యాగేచ్ఛ గలిగి తనతోడ విచారించినఁ దదార్త్వి

జ్యాసమర్థుల నెచ్చటం గానమని పరిహరించుటయు నచ్చటిజనంబులవలన విని మఱియును. 155

సీ. ఎవ్వారి నేసుద్ది • ద్రవ్వించి యచ్చట, నేశాస్త్రిఘను కల్గి • యెఱుఁగికొనునొ
మను జేశుఁ డనుచు నే•పనికిని వెల్పలి, వాక్పృగిల్భత లేసి•నాలిఁగాని
చోరనీరు రాజమం•దిరమును దావారి, కులు మఱి యట్టినా•రలను మిమ్ము
నరసి నేమము గీమ • మరసిన రాజుతో, నీయిల నేలఁగ • నెప్పుడు నుభము

తే. యనెడుమాటగా నాడుకొం • డ్రనియు నాస్తి
లేమి యడిగిన మేము మా•యిండ్లలోనె
యుంసుదు మెఱుంగ మనుఁ డని•యును దివ్య
మాన లిడి కాని చొరఁగనీ • రనుచు వినిరి. 156

క. విని తదుచితమును బ్రభున్పన, కును దమమహిమ నాఁటఁ దెలుపు•కొని నను తాలం
బును గా నొకవాక్పద్ధతి, నొసరించుకొని సీచభాల•యోగ్యాన్ప్రయోగించె. 157

ఉ. భూవరముఖ్యసన్నిధికి • బోయెదుమా నిడిఁ నట్లనుష్టిశల్
మోవఁగఁ గూలిఁ బుచ్చుకొని • మూఁతల గుర్కఁ ద్రాయ్య చేస్తి
శావహీలంగ నేగి ప్రతి•హారజనంబుల కిష్ట మైనవా
చావిధి కొప్పి వొచ్చి ప్రభు•సన్నిధిఁ బెట్టిరి సాష్టనుష్టిశల్. 158

క. పెట్టి వెనువెనుక కటు చని, యట్టిటు భయచపలచేష్ట • లైన యొసంగుచుఁ గాఁ
బట్టెడియాభాలురఁ గృప, యుట్టిపడఁగఁ జూచి నృపతి • యొయ్యన నగుచున్

క. సంతోషమె కద యెయ్యెడఁ, జింత యొకప్పుడు నొకింత • చెందదు మీకా
కొంత మఱుఁగిడక కలిగిన, యంతయు నిక్కముగఁ జెప్పుఁ•డెరుఁగయ్య నాతల్

* క. మాయమ్మా న సు నీవే, రాయల నై తాన దేవ•రాజ్ఞికి
మాయాతుము లానిన యది, పాయక సంతోషముగ్న • సల మిలలామ. 160

క. అన నమ్మాటలచందము, తనయప్పటివాక్యములకుఁ • దగునట్లనుచు
యనయముఁ గ్రతుబుధసేనా, ఘనోపదేశంబు నగుచుఁ • గాన్పించుటయున్.

---

* ఇందలిపదము లీప్రకారమునవిభజించిన సాంస్కృతికము లగును.

మా, ఆయమ్, మాన, సునీవే, రాః, అలనా, ఏకా, అవత్, ఏన, గాః, అసిత్. మా, ఆత
తు, మలాని, న, యది, పాయక, సంతః, అసముత్, న, పల, మిల. సా, అమా.

అర్థము.

సునీవే=శోభనమైన మూలధనము గలరాజా (ని) ‘స్త్రీకటీవస్త్రము నేస నీవునకునే’ అ.
యమ్=వచ్చుబడిని, మామాన=గౌరవింపకుము, వచ్చుబడిని గౌరవించి మూలధనమును వేసము
వెచ్చింపకు మని యాశయము. రాః=ధనము. (ని) ‘అగ్నిరైవిభవాఅసి’ అ. అలనా=నాశము లేనియదు

చ. విరివిగ నంతరంగమున • విస్మయ మావహిలంగ వారిరూ
పరయుచు భస్మసంవృతమ•హాగ్నికణంబులువోలె గూఢవి
స్ఫురణత నున్కిఁ గాంచి పరి•పూర్ణవినీతి సుమోదభక్తిత
త్పరత దలిర్ప లేచి నర•పాలుఁడు సాగిలి మ్రొక్కె వారికిన్. 163

క. అని చెప్పఁ గలాపూర్ణుఁడు, విని యాతం డింతశబ్ద•విదుఁడే యిటు తో
త్తె నెఱుంగ మని మదాశయుఁ, గనుఁగొని యొక్క సబహుమాన•గౌరవదృష్టిన్.

వ. కనుఁగొని మదాశయుండు కూర్చుండుము మని ముమ్మాటు దాఁక ముదల పెట్టి యంతట బలిమిన కూర్చుండ నియమించి మధురలాలసం గటాక్షించి యట మీఁదఁ జెప్పు మనుటయు నది యిట్లని చెప్పె నట్లు మదాశయుండు మ్రొక్కి యానలువుర నాసనపాద్యాదివిధులం బూజించి నిజాస్థానజనులం జూచి యిప్పటి వీరలవాక్యంబులందు నేమివిశేషంబు గలుగఁ దెలిసి యంతఁ బూజించె నని మీమనంబుల నున్నవి యేమొ యవ్వాక్యంబులమహిమ వినుండు. 165

సీ. ఆయంబు సరకు సే•యకుము శోభనమూల, ధనుఁడ ధనం బచ్చిం•దంబుముఖ్య

---

ఏకా=ముఖ్యమైనదియు, అవత్ + ఏవ-అవదేవ=(తన్ను రక్షించువానిని) కాపాడునదియు (అగును). అజే జే=(అజంయజతీతిఅజేట్ తస్మై) విష్ణుని బూజించెడు, (అజశ్శంభౌవిష్ణుధాత్రోః కామేభాగేర ఘోస్సతే' నానా. రాజే=రాజుకొఱకు, మా=లక్ష్మి, ఆయాతు=వచ్చును.(ని) 'ఇందిరాలోకమాతా మా' అ. ఖలాని=పాపములు, ః=చేగవు, విష్ణునుద్దేశించి క్రతువులు చేయువారికి సకలసంపదలు గల్గు ననియుఁ బాపములు తొలఁగు ననియు నాశయము. పాయక=ఓరతుసుఁడా, సంతోః=విద్వాంసులు, యది=(వచ్చిరి) యేని, అసముత=సంతోషము లేనివాఁడవై, నపల=తొలఁగిపోకుము, ఖల=(సంతోషముతో వారిని) కూడికొనుము. విద్వాంసులు వచ్చినయెడ వారికి విముఖుఁడవు గాక సత్కృతము ల్మని యాశయము. (ఏలయన) అసీః=ఈవిద్వాంసులు, సా=ఆలక్ష్మియే, విద్వాంసులరాక సంపత్కారి మని భావము.

ఇందలిపదములే యిట్లు విభజించిన నచ్చతెలుఁగువు యగును.

మాయమ్మన, చు, నీవు, ఏ, రాయలవు, ఐ, కావన్, దెపు౦ం, జే, జే, జే, మాయాతుమలు, అనినయది, పాయక, సంతోసము, ఉన్న పలము, ఇలసామీ.

అర్థము.

దేవరా=ఓరాజా, జే జే జే=జయ జయ జయ యని యాశీర్వచనము, ఎల్లవారికంటె నుత్కర్షము గల్గియుండు మని యర్థము. ఇలసామీ=ఓమదాశయుఁడా, నీవే, రాయలవై=రాజవై (బహువచనము గౌరవార్థము) కావన్=రక్షింపఁగాన్, సంతోసము=ఆనందము, పాయక=విడువక, మాయాతుమలు=మామనసులను, ద్వితీయార్థమునం బ్రథమ, అనినయది=ఆశ్రయించినది, ఉన్నపలము=తక్కిన ప్రయోజనముసహితము, అనినయది=నీవు పాలనము సేయఁగా మాకు సంతోషమును దక్కినయుల్లప్రయోజనములును సమకూడె నని భావము.

మాయమ్మన=మాతల్లియాన, చు=చుమా, చూచుధాతువు ప్రార్థనార్థకరూపాంతరము. మీఁదఁ జెప్పినయర్థము నిజ మని నమ్మించుటకీవాక్యము లోకరీతి ననుసరించి చెప్పఁబడెను.

మైనయట్టిది ధన్వి ♦ నదియు జేసి కజుయ, జంచువానిక లక్ష్మి ♦ చెరుఁ బాత
కములు చేరవు రక్ష ♦ కాకోవిదులు కల్గి, రాయసమోదాద ♦ నై యనుగను
సమ్మిశ్రభావంబు ♦ సలుపుచు మాలక్ష్మి, కోవిదు లనియెడు ♦ దీనభాష.

ఆ. వరుసఁ బదవిభాగ ♦ విరచనతో నర్థ, మరయఁ దోఁచుచున్న ♦ యాది గిరంబు
తెలియఁ జూడఁ జేత ♦ దీయాంధ్రవచనసం, దర్భమునను శబ్ద ♦ తంత్రవిదులు.

వ. అని పలికి మదాశయుండు ప్రథమాగమున కభిముఖుఁడై వినయవినమితుండును ముకుళితకరుండును నగుచు మీ రెవ్వ రిట్టిప్రచ్ఛన్నవేషంబున నేల సంచ్చితిరి మీవిధం బంతయు నాకుఁ దెలియ నానతీవలయు ననిప్రార్థించిన నతండును దమ తండ్రి యన్నదాననియమంబు మొదలుకొని పూర్వవృత్తాంతంబు తనతల్లుల వలన విన్నదియుం దారు గన్నదియుం దద్దర్శనపర్యంతంబు సకలంబుఁ జెప్పిన నతండు నిజపురోహితదోషాయత్తతఁ జేసి పూజార్హు లని విచారింపక నిరసించిన దుర్వివేకంబునకు సిగ్గుపడుచు ని ట్లనియె. 167

క. ఇది దెలిసియె కావలయుఁ, మదాశయుం డనుచుఁ బేగు ♦ నాకు నిజంట యే
నిదిగో కననేరన కో, విదులఁ బురోహితునికపట ♦ వృత్తికలోనై. 168

చ. అని యపు డమ్మహామహుల ♦ ప్రార్థన బల్మిని దక్కినట్టిద
డసము నరేంద్రుఁ డాతని కొ ♦ నర్పక యాత్మపురోహితత్వసం
ర్థనమును మాన్పి తత్కపట ♦ తంత్రములోపలి నాగ్రహించెం
చినజనులన్ లఘుప్రబల ♦ శిక్షవినీతులఁ జేసె నంతయున్. 169

ఆ. ప్రార్థనం బొనర్చి ♦ ప్రథమాగమాదుల, ధర్మవిధిం బురోహి ♦ తత్వమునకు
నిలుపుకొనియె వారు ♦ నిజమాతృయుక్తులై, తగినగతి గృహస్థ ♦ వాసులగుచు.

వ. ప్రభుసన్మానంబున నత్యంతవైభవంబునం బ్రవర్తిల్లుచు నతిథి నిత్యనైమిత్తికంబు లైన క్రతువులు సేయింపుచుఁ దమజనకునియునికి యెఱుంగ నెట్టకేలకుఁ బాండ్య కేరళ చోళ ద్రవిళాది దేశంబులం బరికింప దగినవారిం బనిచి యొకచో నలబ్ధవృత్తాంతు లయి చింతాక్రాంతు లగుచుఁ దల్లుల నుచితరీతిం గొన్నికొన్ని యాశలు చూపి యూరార్చుచుండి రలఘువ్రతుండును నష్టభార్యాన్వభావ క్రియలజ్జితుం డగుచుఁ దజ్జనపదంబుల సుహృజ్జనులకుఁ దెలుపక నొకదూర దేశాంతరంబుల యాయావరవృత్తి నర్థార్జనం బొనర్చుచుఁ దత్ప్రమితాన్నదానం బు నడుపుచు నది నెఱయక సాగకున్న నన్నవర్జనంబు చేసి తాను గందమూల పయఃఫలాదుల దేహయాత్ర సలుపుచు నంతరాంతరంబున నిత్యస్వల్పాన్నదా నాచరణంబులం దనియక బహుధనార్జనంబునకు నుపాయంబు వెదకుచు నంతట మృగేంద్రవాహనామహాశక్తిమహిమ విని తదారాధనంబునకు నొకని వలన మంత్రోపదేశంబు సాధించి యద్దేవిసన్నిధికిం జని యచ్చటిప్రభవత్కథా శ్రవణఫలంబున సకలసంపదాయురభివృద్ధిపుత్రపౌత్రాదిలాభంబు విని యా

డుఁ దనకుఁ బుత్త్రపౌత్త్రాదు లనుమాట యటుండినఁ దక్కినఫలంబు గల్గుట సిద్ధంబు గదా యనియెడుతలఁపున జపంబుచేత భవత్కథాశ్రవణంబు సాధించెఁ దుద నది యత్యంతసంభావనీయం బైనపుత్త్రాదిలాభంబును గలిగింపక మాన దయ్యెం జూచితే యోమణిస్తంభతనయ యిట్టిది సుమీ దేవరకథామహిమ యని పలికి మధురలాలస యూరకుండెఁ గళాపూర్ణుండును నలఘువ్రతుం జూచి నీసందియం బెల్లను దీఱెఁ గదా యని పలికి ప్రథమాగమాదుల నిరీక్షించి మీతండ్రికిఁ దగినయుపచారంబులు నడపక యిప్పుడు ననుమానించినం బాతకంబు రాదే యని పలికెఁ బ్రథమాగమాదులును భయభక్తివినయసమ్మోదసంభ్రమంబులతోడ నలువురును లేచి వచ్చి యలఘువ్రతునిపాదంబులకుం బ్రణామంబులు గావించి యానందబాష్పపులకవిలసితశరీరుం డైనయాజనకుని యాలింగనమూర్ధాఘ్రాణాదివివిధోపలాలనంబుల నానందించి యతనిచేరువం గొలిచి యుండి రప్పు డమ్మహాత్ములతోంటియాంధ్రగీర్వాణభాషాశ్లేషవైచిత్రిచిత్తంబునం బాఱఁ గళాపూర్ణుండు వారలం జూచి యిట్టివిచిత్రకవిత మీమతులకు నిపుడు దోఁచునెకొ యని కౌతుకసంబంధగంధమందరహాసితంబుతోడఁ బలికిన నందుఁ బ్రథమాగముండు. 171

* క. తా వినువారికి సరవిగ, భావనతో నాను నతివి • భావిసు తేజా
దేవరగౌరవమహిమన, మావలసినకవిత మరిగి • మాకు నధీశా. 172

చ. అన భళిరా మహాకవిశి • ఖాభరణంబ మదుక్తభాషణం
బున కిపు డిచ్చునుత్తరము • పూని విచిత్రపుఁబద్య మయ్యె మే
లని విభుఁ డాడె న ట్లది య • టంచుఁ గవీంద్రుఁడు నవ్వె నవ్వె నా
యన పఠియింపుమా తిరుగి • నన్నుఁ దదుక్తికి మెచ్చె విప్రుఁడున్. 173

---

* ఈపద్యము చివరనుండి చదివిన సంస్కృతమును మొదటినుండి చదివినఁ దెనుఁగు నగును.

చివరనుండి పదవిభాగము.

శాధి, ఇన, కుమ్, ఆగిరి, మత, వికనసి, లవమాన, మహిమవరగౌరవదే, జాతే, సువిభో, ఇతి, నా, అంతః, నవభోః, గవి, రసకిరి, వా, అనువితా.

అర్థము.

ఇన=ఓప్రభువా, (ని) ‘ఇనస్సూర్యేప్రభౌ’ అ. కుమ్=భూమిని, (ని) ‘గోత్రాకుః పృథివీపృథ్వీ’ అ. ఆగిరి=పర్వతము లున్నంతకాలము, శాధి=శాసింపుము, చిరకాలము భూమిని బాలింపు మని భావము. మత=ఓసమ్మతుఁడా, వికనసి=మిగులశోభిల్లెదు, లవమాన=రామునికుమారుఁ డైనలవునకు వలెఁ జిత్తౌన్నత్యము గలరాజా, (ని) ‘మానః స్త్రీణాంకోపభేదే గర్వేచిత్తోన్నతావపి’ నానా. మహిమవరగౌరవదే=గొప్పతనముచే నెక్కువగౌరవము నిచ్చెదు, సువిభో=మంచిరాజా, ఇతి=ఇట్లు, జాతే=కలుగఁ

క. ఆరీతిం దమలోనం, దారే సరిపుచ్చుకొనఁగఁ ♦ దత్పద్యచమ
త్కారం బపుడు సభాజన, మారసి యేమియును గాన ♦ కద్భుత మందెన్.

వ. అంత నవనీకాంతుండు సభాసదులం జూచి యిప్పు డాపద్యంబు తిరుగం బఠియింపుమనుట మఱియును బఠియింపు మనుట గాదు వినుం డని యి ట్లనియె. 175

సీ. ఏలు మో నాయక ♦ యిల గిరు లెంతకా, ల మ్మంతకాల మో ♦ సమ్మతుండ
మిపుల శోభిల్లెడు ♦ లవకుమారసమాన, మానుఁడ మహిమ న ♦ నూన మైన
గౌరవం బొసఁగుచ ♦ క్కనిప్రభు విట్లు గ, ల్కఁగ నోయి పురుషుఁ డీ ♦ గౌరవమున
నభినవ తేజస్కుఁ ♦ డై వాణి రసములు, గులికెడునట్టిది ♦ గలుగఁగాను
తే. వినుతి సేయనివాఁడె యం ♦ చును మహార్థ
మున్న యది సంస్కృతంబునఁ ♦ జెన్ను మీఱ
వరుసఁ దుదనుండి మొదలికిఁ ♦ దిరుగఁ జదువ
నా తెనుఁగుపద్యమున బుధు ♦ లరసికొనుఁడు. 176

ఆ. అనుడు వారు నట్ల ♦ యవరోహమున దానిఁ, జదువుకొనుచుఁ దెలిసి ♦ సంతసిలుచు
నెఱయ మెచ్చిరి కవి ♦ నృపులయాశువిచిత్ర, మృదుకవిత్వకృతియుఁ ♦ దదవగతియు.

వ. కళాపూర్ణుం డంత ననేకమణివిభూషణవిచిత్రాంబరప్రధానం బైన పారితోషిక దానంబునం బ్రథమాగము నలంకరించె నప్పు డతనియమాత్యుండు సత్వదాత్మ నామధేయుండు మధురలాలసకుం బ్రణామంబుఁ జేసి యి ట్లనియె. 178

ఉ. ఓరుచిరాత్మ యోపరమ ♦ యోగిని యే సటుపూర్వమైన నా
పేరుఁ గులాదులున్ మఱచి ♦ బిమ్మిట నొక్కెడ నుంటఁ దెచ్చి కా
సారపురంబువా రిడిరి ♦ సమ్మతి నాకును సత్వదాత్ముఁ డన్
పే రవి దెల్పవమ్మ మఱి ♦ పెద్దలఁ గానమ యెందుఁ దద్జ్ఞులన్. 179

---

గాన్, నను=ఓయి, నా=మనుజుఁడు, అతః=ఆరాజు చేయుగౌరవమువలన, నవభాః=నూతనమైన తేజముగలవాఁడై, రసకిరి=శృంగారాదిరసముల వెదచల్లెడు, గవి=వాణి విద్య యని యర్థము. కలుగఁగా, అనువితావా=స్తోత్రము చేయనివాఁడా? చేయువాఁడే యని యర్థము.

ఉదారబుద్ధి గలవాఁడును గౌరవించువాఁడును నగురాజు పాలింప విద్వాంసు లందఱు స్తుతియింతు రని భావము.

మొదటినుండి పదవిభాగము సులభము.

అర్థము.

అతివిభావిసు తేజా=మిక్కిలిగా వ్యాపించెడుమంచిప్రతాపముఁ గల, అధీశా=ఓరాజా, దేవర గౌరవమహిమన=మీ గౌరవాతిశయముచేతనే, మావలసినకవిత=మాకుఁ గావలసినకవిత్వము, తాన్=అది, వినువారికిన్=శ్రోతలకున్, సరవిగన్ = అనుకూల్యము గలుగునట్లు, భావనతోన్ = తలఁపుతోన్, మాకున్, మరిగి=వశపడినదియై (మఁగి. యని యుండవలెను) ఆనన్=ఆశ్రయించును.

క. అని యడుగుచుండ బాలిక, కను నులుముచుఁ బెదవి విఱిచి • కటకట వాపో
యెను మొగ్గవాలుచందం, బున నడు మెగనెత్తికొనుచుఁ • బొత్తులమీఁదన్.

క. అపు డదగని యింతన యీ, విపరీతపుఁజేఁత లేల • వివరింపఁగదే
యిపు డే నడిగినయది చో, ద్యపుఁదల్లియనుచు మఱియు • నాతఁడు మ్రొక్కెన్.

చ. కలుములపూప లై మునులు • గాననియట్టికతల్ వచింపఁగా
నెఱిఁగిన నీకు నాఁకలియు • నెప్పులు నా యనువారు మాయలం
బఱచిన నేమొ పో మఱి స్వ • భావపుదివ్యవిభూతిఁ గ్రోడనే
వఱలుచు నున్కిఁ బ్రోవు మను • వారును నై రవు డాసభాసదుల్. 182

ఆ. ఇఁక నేనిఁ గ్రమ్మఱ • నెఱుఁగింగవలయు నం, దేహపదము నీవు • దెలిపె దనుచు
నమ్మి యున్న వారి • మన్న యీవెడమాయ, లం దనేల యసిరి • కొంద అంత.

క. అమ్మాడ్కి మఱియు నెవ్వా, రెమ్మెయిఁ దనువేఁడుకొన్న • నెఱుకకలిమి లే
కమ్మును గాన్పింపక న, త్యమ్ముగ నాఁకటన యేడ్చె • నాశిశువు గడున్. 184

శా. ఆనాకన్యకయు నాసుబోధముఁ దిరం • బై యున్కి యట్లబ్బువై
వావేశం బపు డెద్దియో తదలిమా • హాత్మ్యంబు రప్పించెఁ గా
కావేశం దెలియంగ లేమ తగ సం • ప్రార్థించి తద్దివ్యబో
ధావిర్భావనిధానముం గటకటా • యం చుండె నుర్వీశుఁడున్. 185

వ. తదనంతరంబ యమ్మహాత్మ స్తంభసందనుండు రూపానుభూతిని మదాశయుం బిలిచి మీబాలికకథ లన్నియు వింటిరే కదా మీభాగ్యవైభవంబునకు నెందు నీడు లే దిది మొదలు నాకు మీర లత్తమామ లైతిరి సందియంబు లేదు మీర లింకం దక్కినకొలువు మాని యీశిశువు నింటికిం గొనిపోయి పోషింపుం డను టయు నతనికి సత్త్వదాత్ముం డిట్లనియె. 186

ఆ. పార్థివేంద్ర వారి • పనుచుమెడన్ మణి, హార మొప్పు మెట్టి • తప్పుడ నీకు
వార లత్తమామ • లైరని యున్నాఁడఁ, దదనుగుణము లయ్యెఁ • దత్కథలును.

క. ఈనిసువు సులక్షణము ల, నూనంబుగఁ జూడ నిది నృ • పోత్తమ నానా
భూనాథవధూమాళిమ, ణీనిర్మితనూపురార్చ్య • నీయాంఘ్రి సుమీ. 188

చ. అని యతఁ డాసుమాటలకు • నాత్మఁ గరం బలరన్ దరస్మితా
ననుఁ డగుచున్ మహీశుఁడు ఘ • నప్రమదంబున వారి నంతఁ దా
ననిపెఁ జనుండు మీరలు గృ • హంబున కాత్మజఁ గొంచు నంచు గాం
చనమణిభూషణప్రముఖ • సంపద క్రొత్తగ వెంట నంపుచున్. 189

క. ఆమధురలాలసాకథ, లేమియు శుద్ధాంతమునకు • నేఁగక యుండన్
భూమిపతి యడఁచె నభినవ, కౌముది విన నేల యనుచు • ఘనయత్నముతోన్.

తే. అంత నలఘువ్రతుని యభీ • ష్టాన్నదాన
కరణపర్యాప్తబహుధన • గ్రామదాన

